శ్రీః

# అశ్వధాటీకావ్యమ్

## పండితేంద్ర జగన్నాథ విరచితమ్

## అశ్వధాటీపీఠిక - నవవీథీవ్యాఖ్య


‘సహజపాండిత్య’ ‘తర్కకోవిద’ ‘విద్యావిభూషణ’ తత్త్వశాస్త్రపారంగత’

**గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజులు శర్మ**

పుష్పగిరి మహాసంస్థాన పండితుఁడు.





ప్రకాశకులు

**రావికృష్ణకుమారి మోహనరావు దంపతులు**

చీరాల

# అశ్వధాటీకావ్యమ్

పండితేంద్ర జగన్నాథ విరచితమ్

నవవీథీ వ్యాఖ్య

గరిమెళ్ళ సోమయాజులుశర్మ


***ముద్రణ : 23-05-2014 - శ్రీమత్ హనుమత్ జయన్తి***
***ప్రతులు : 500***
***పేజీలు : 84***
***వెల రూ. : 70-00***




Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

ఓం

శ్రీరామచన్ద్రాయ నమః

# అశ్వధాటి

**శ్లో॥ వాణీ మదభ్రమర-వేణీ విపఞ్చషకు-వేణీ నమత్సురవర**
**శ్రేణీ దృగబ్జవిజి-త్రైణీ సుధామధుర-వాణీవశాంబుజభవా ।**
**ప్రాణీభవత్సుకవి-వాణీ కుధీగళకృ-పాణీ విశాలపులిన**
**శ్రోణీ సుశాస్త్రమణి-శాణీ జగత్త్రయపు-రాణీ శుభం దిశతు వః॥**

అశ్వధాటీవృత్తము సంస్కృత కవులకు మిక్కిలి ప్రియమైనది. ఆధునికాంధ్రకవులు కొందఱు దీనిని తమ కావ్యములలోఁ బ్రయోగించిరి. ప్రచుర ప్రచారము గల వృత్తరత్నాకరాది సంస్కృతచ్ఛందో గ్రంథములలోఁ గాని యప్పకవీయాద్యాంధ్రచ్ఛందో గ్రంథములలోఁ గాని దీని లక్షణము లేదు. కావున దీని లక్షణము సమగ్రముగా నిచ్చుటఁ బ్రస్తావింపఁబడున్నది.

శ్రీవేంకటాధ్వరి మహాకవి రచించిన 'విశ్వగుణాదర్శ' చంపూకావ్యము నందలి-

**శ్లో॥ కామాదివైరిగణభీమానవద్యనిజనామాభిలాషగరిమా (224)**
అను శ్లోకమునకుఁ బదార్థచంద్రికావ్యాఖ్యలో శ్రీబాలకృష్ణశాస్త్రిగారు - "అశ్వధాటీవృత్తమ్। అస్య లక్షణం వృత్తరత్నాకరే నోపలభ్యతే। చిత్రవృత్తే ష్వస్యాంతర్భావః॥"
అని చెప్పినారు. సంస్కృత లాక్షణికులు దీనిని మత్తేభ వృత్త మని పేర్కొనిరి.

(1) మత్తేభనామ కిల - వృత్తేషు వృత్త మభిధత్తేస్మ కోఽపి కవిరాడ్
గౌర్నాగరో నగిరి - నాగోపమోఽస్తి నచ - వృత్తం సమాన మమునా॥
(వృ. మ. కో. 4-33) అని వృత్తమణికోశములో శ్రీనివాసకవి.

(2) మత్తేభాఖ్యం తభయజ। - సరనగయుక్తం స్వరార్కఫణిభిన్నమ్॥
అని మందారమరందచంపువులో శ్రీకృష్ణకవి.

(3) వృత్తవిచిత్రరామాయణము నందలి 'వందారుభక్తజన" (యుద్ధ - 49)

శ్లోకవ్యాఖ్యలో - మత్తేభం వృత్తమ్ -

'తో భో యజౌ సరనగాః పంక్తిసూర్యయతి మత్తేభ మత్ర కథితమ్'
అని యయ్యగారి భగీరథశాస్త్రిగారు.

(4) యాదవాభ్యుదయము నందలి 'లోలాపతచ్చరణ' (4- 23) శ్లోకవ్యాఖ్యలో -'మత్తేభవృత్తమ్' - అని యప్పయ్యదీక్షితులు.

ఇచ్చట దీక్షితులు కూడ లక్షణము నుదాహరింపలేదు.

(5) కవిశేఖర – చంద్రశేఖరభట్టు 'వృత్తమౌక్తికములో' దీనినే 'మదాలస' వృత్త మని వక్కాణించినాఁడు.

**శ్లో॥ కర్ణం జకారరసయుగ్మం విధేహి సఖి!కర్ణం తతః కురు రసం**
**హారం నకార మథకర్ణం నరేంద్ర మిహహస్తం విధేహి చ తతః ।**
**సూర్యాశ్వసప్తయతికుర్యా ద్యథాభిరుచిపశ్చా ద్వసౌచ విరతిః**
**నేత్రద్వయేన కురుపాదాంతవర్ణ మితి వృత్తమ్ మదాలస మిదమ్॥** యథా–

**శ్లో॥ శంభో! జయ! ప్రణమ–దంభోజనాభవిధి–దంభోళిపాణితరణే**
**రంభోరుగాఢపరి–రంభోపభోగదివి–రంభోపగీతిసతతమ్।**
**స్తంభోదయప్రణత–జంభోపఘాతిశిశు–దంభోపకల్పితతనో**
**రంభోదరప్రతిమ–శంభో! జయామలవి–దంభోధివర్ధనవిధో! ॥** యథా వా –

**శ్లో॥ మందాకినీపులిన–మందారదామశత–బృందారకార్చితవిభో!**
**నారాయణప్రఖర–నారాచవిద్ధపుర–నారాధిదుష్కృతవతా!**
**గంగాచలాచలత–రంగావలీముకుట–రంగావనీమతిపటో!**
**గౌరీపరిగ్రహణ–గౌరీకృతార్ధ తవ–గౌ రీదృశీ శ్రుతిగతా ॥**

యథా వాస్మద్వృద్ధప్రపితామహ పండితముఖ్య శ్రీమద్రామచంద్ర భట్టకృత నారాయణాష్టకే –

**శ్లో॥ కుందాతిభాసిశర–దిందా వఖండరుచి–బృందావనవ్రజవధూ**
**బృందాగమచ్ఛలన–మందావహాసకృత–నిందార్థవాదకథనమ్ ।**
**వందారుబిభ్యదర–విందాసనక్షుభిత–బృందారకేశ్వరకృత**
**చ్ఛందానువృత్త మిహ–నందాత్మజమ్ భువన–కందాకృతిం హృది భజే ॥**

ఇత్యాదిమహాకవిప్రబంధేషు శతశః ప్రత్యుదాహరణాని ॥

(6) 'వాగ్వల్లభములో' దుఃఖభంజనకవి దీనినే 'సితస్తబక'వృత్త మని నుడివినాఁడు –

**శ్లో॥ ఉక్తం సితస్తబక–వృత్తం తభౌయజస–రానో గురు ర్యది తదా।**
దుఃఖభంజనకవి కుమారులైన మహామహోపాధ్యాయ – శ్రీదేవీ
ప్రసాదకవిచక్రవర్తులు దీనినే 'పరిస్తబక' మని 'యశ్వధాటి'

యని వాగ్వల్లభవ్యాఖ్యలోఁ బేర్కొనినారు –

"ఉక్త మితి – యది ప్రతిపాదం తగణ – భగణ – యగణ – జగణ – సగణ – రగణ – నగణ – గురవః స్యుస్తదా 'సితస్తబక' నామకం వృత్త ముక్తమ్। శేషేణేతి శేషః। 'పరిస్తబక' ఇత్యపి నామాస్య బోధ్యమ్। 'అశ్వధాటీ' ఇత్యపి నామాస్య కేచి ద్వదంతి॥"

ఈ విధముగా నీయశ్వధాటీవృత్తమునకు 'మత్తేభము' 'మదాలసము' 'సితస్తబకము' మొదలగు నామాంతము లున్నను శ్రీకాళిదాస మహాకవి రచించిన 'చేటీభవన్నిఖిలఖేఒటీ' యను దేవీస్తుతి శ్లోకముల కశ్వధాటీవృత్త మనియే లోకములో వ్యవహారము.

**శ్లో॥ చేటీభవన్నిఖిల-ఖేఒటీ కదంబవన-వాటీషు నాకిపటలీ**
**కోటీరచారుతర-కోటీమణీకిరణ-కోటీకరంబితపదా।**
**పాటీరగంధికుచ-శాటీ కవిత్వపరి-పాటీ మగాధిపసుతా**
**ఘోటీకులాదధిక-దాటీ ముదారముఖ-వీటీరసేన తనుతామ్॥**

అను శ్లోకములో 'ఘోటీకులాదధికధాటీమ్' అని వాడి యీ వృత్త నామ 'మశ్వధాటి' యని కాళిదాసు ధ్వనింపఁజేసినాఁడు. అందువల్లనే యిందు ముద్రాలంకారము.

**శ్లో॥ సూచ్యార్థసూచనమ్ ముద్రా ప్రకృతార్థపరైః పదైః ।**
**నితంబగుర్వీ తరుణీ దృగ్యుగ్మవిపులా చ సా॥**
అని కువలయానందలక్షణము.

కాళిదాసు నాఁటికే దీని కశ్వధాటి యను పేరు ప్రసిద్ధమైనచో లాక్షణికులు దీని 'నశ్వధాటి' యని యేల పేర్కొనలే దన్నచో వినుఁడు! ఏ వృత్తము యొక్క లక్షణ మావృత్తము నందే చెప్ప వలయు నని ఛాందసమర్యాద. అశ్వధాటీపద మశ్వధాటీవృత్తములో నిముడదు. అందు వలన నశ్వధాటిని మత్తేభవృత్తమని లాక్షణికులు వ్యవహరించిరి.

ఇపుడు దీని లక్షణము చెప్పఁబడుచున్నది -

అశ్వధాటీ వృత్తము నందుఁబాదమునకు 22 అక్షరము లుండుటచే నిది యాకృతిచ్ఛందోజాత మని స్పష్టము. ఆకృతిచ్ఛందమునందుఁబుట్టిన వృత్తములలో నిది 1925 509 వ వృత్తము. ఇందుఁ బ్రతిపాదమునందు - 'త - భ - య - జ - స - ర - న - గ' గణము లుండును. 7-14 అక్షరములు యతిస్థానములు. 8-15యతిస్థానములలోఁ బ్రాసయతి యుండవలయును. అనఁగాఁబాదమునందు 2-9-16 అక్షరములు సమముగా నుండవలయును.

ప్రాసాక్షర మనుస్వారయుక్తమైనచో సర్వత్ర యనుస్వారయుక్తము, ద్విత్వాక్షరమైనచో సర్వత్ర ద్విత్వాక్షరము, సంయుక్తాక్షరమైనచో సర్వత్ర సంయుక్తాక్షరము నుండవలయును.

**సానుస్వారాక్షరప్రాసము-**

సంసారలంపటరి-రంసాత్మకస్య మమ-కంసారి రేవ శరణమ్।

**ద్విత్వాక్షరప్రాసము -**

ఉల్లోలజన్మమృతి-కల్లోలినీకలిల-హల్లోహలస్థ మవ మామ్।

**సంయుక్తాక్షరప్రాసము -**

దుర్గాం తనూఘటిత-భర్గాం నమద్దివిజ-వర్గాం నమామి సతతమ్।

ప్రాసవిషయములో నాంధ్రులచే హల్సామ్యము మాత్రమే స్వీకరింపఁబడినను గమనసౌందర్యమునకై యశ్వధాటీ వృత్తమునందు హల్సామ్యము తోపాటుగా నచ్సామ్యమును గూడ గ్రహింపవలయును.

వీణాధరామ్ భజత-వాణీం సదాచరణ-రేణూల్లసన్మునిగణామ్। అని చరణమును నిర్మించినచో పద్యసౌందర్యము మందగించుటయే కాక కర్ణకఠోరముగాఁ గూడ నుండు నని గ్రహింపవలయును.

**శ్లో॥ లోలాపతచ్చరణ-లీలాహతిక్షపిత-హాలాహలే నిజఫణే**
**నృత్యంత మప్రతిఘ-కృత్యంత మప్రతిమ-మత్యంతచారువపుషమ్ ।**
**దేవాదిభి స్సమయ-సేవాదరత్వరిత-హేవాకఘోషముఖరైః**
**దృష్టావధాన మథ-తుష్టావ శౌరి మహి-రిష్టావరోధసహితః ॥** (4-123)

అని యాదవాభ్యుదయమునందు వేదాంతదేశికులును

**శ్లో॥ వందారుభక్తజన-మందారభూజమర-విందాతిసుందరముఖం**
**జంభాసురారి రథ-సంభావయం స్తదరి-మత్తేభకుంభదళనమ్ ।**
**రంహోగతిం తు నర-సింహమ్ ముదా పదగ-మంహోముచం రఘువరం**
**రంగే స్మ యాపయతి-సాంగం సమాతలిశ-తాంగం తురంగమయుతమ్॥**

అని వృత్తవిచిత్రరామాయణములో నయ్యగారి రామశాస్త్రిగారును బ్రతిపాదము నందును భిన్నప్రాసములను స్వీకరించిరి. యాదవాభ్యుదయశ్లోకము నందలి రెండు - నాల్గుపాదములలోఁ ద్రిప్రాసము మిక్కిలి హృదయంగమముగా నున్నది. వృత్తవిచిత్రరామాయణశ్లోకములోఁ బ్రాసమునందు హల్సామ్య మున్నను నచ్సామ్యము లేదు. ద్వితీయచరణములోఁ బ్రాసభంగము. 'మత్తేభకుంభదళనమ్' అను దానికిఁ 'గుంభీంద్రకుంభదళనమ్'. అను పాఠమును గల్పించినను గవ్యభిప్రేత మగు ముద్రాలంకారము సిద్ధింపదు. కావున-

దత్తేప్సితం దితిజ - మత్తేభసింహశిశు - ముత్తేజయన్ హరిహయః।

అను పాఠమును గల్పించినచో సాధువు.

**శ్లో॥ ఖంజాయితోఽధిమతి-గంజాపరోఽపి బత-సంజాయతేఽత్ర ధనదః**
**సంజాఘటీతి గుణ-పుంజాయితస్య నతు- గుంజామితం చ కనకమ్।**

**కింజాగ్రతీ జయసి?–కిం జానతీ స్వపిషి?–శింజాననూపురపదే।**
**తంజాపురేశి! నవ–కంజాక్షి! సాధు తది–దం జాతు వా కిము శివే! ॥**

అను జగన్నాథకవి శ్లోకములో నాల్గవపాదమునందుఁ ‘దేజోపురేశి!’ యను ముద్రితపాఠము సాధువు కాదు.

వేదాంతదేశికాదికవులు,చంద్రశేఖరభట్టాదిలాక్షణికులు ప్రతిపాదమునందు భిన్న ప్రాసమును స్వీకరించుటచే నాల్గుపాదములందు నేకప్రాసనియమము లే దన్నచో నది సరి కాదు. కాళిదాసు, వేంకటాధ్వరి మొదలగు మహాకవులచే స్వీకరింపఁబడుట వలనను, వృత్తశోభాకరమై శ్రుతిరంజక మగుట వలనను నశ్వధాటీ వృత్తములో నాల్గు పాదములందును 12 స్థానము లందు నొకే ప్రాసాక్షరమును స్వీకరింపవలయును.

దేవీస్తుతి యందలి ‘దాక్షాయణీ దనుజ – శిక్షావిధౌ’ యను శ్లోకములో –
‘యక్షేశసేవితని–రాక్షేపశక్తిజయ–లక్ష్మ్యవధానకలనా’

అను నాల్గవపాదములోఁ బ్రాసము తప్పినను మహాకవి ప్రయోగ మని సోఢవ్యము.

ఇప్పు డశ్వధాటీవృత్తప్రచారమును బ్రస్తావింతును. సంస్కృతములో నశ్వధాటీ వృత్తనిబద్ధ మైన దేవీస్తుతి కలదు. నిర్ణయసాగరము వారి బృహత్స్తోత్రరత్నాకర ద్వితీయ భాగములో ‘చేటీభవన్నిఖిలఖేటీ’ యను దేవీస్తుతి ‘యంబాష్టక’ మను పేరుతో శ్రీశంకరభగవత్పాదవిరచిత మని పేర్కొనఁబడినను ‘దేవీస్తుతి’ కాళిదాసవిరచిత మనియే సంప్రదాయము. దేవీస్తుతి యందుఁ గొన్ని పుస్తకములలో 10; కొన్ని పుస్తకములలో 12 శ్లోకములు ముద్రింపఁబడినవి. (1) చేటీభవన్నిఖిలఖేటీ (2) ద్వైపాయనప్రభృతి (3) యాళీభిరాత్తతనుపాళీ (4) బాలామృతాంశునిభఫాలా (5) కంబావతీవసవిడంబా (6) దాసాయమానసుమహాసా (7) న్యంకాకరేవపుషి (8) జంభారికుంభిపృథు (9) దాక్షాయణీ (10) వందారులోకవరసందాయినీ (11) యత్రాశయోలగతి (12) ఇంధానకీరమణిబంధా యనునవి శ్లోకముల మొదళ్ళు. మందాక్రాంతమునందు వలెనే యశ్వధాటీవృత్తరచనయందుఁ గూడ గాళిదాసమహాకవిదే యగ్రతాంబూలము. వేదాంతదేశికుల యాదవాభ్యుదయమునందును, వేంకటాధ్వరి విశ్వగుణాదర్శమునందును,అయ్యగారి రామస్వామిశాస్త్రి వృత్తవిచిత్రరామాయణమునందును, రామస్వామిశాస్త్రి రచించిన నృగమోక్షప్రబంధవివరణారంభము నందు నశ్వధాటీవృత్తము ప్రయోగింపఁబడినది.

‘అశ్వధాటీ శతకము’ జగన్నాథకవి రచించినది కలదని తెలియుచున్నది. ఈ జగన్నాథకవి 1. హృదయామృత 2. శరభరాజవిలాస 3. ఆర్యాస్తవరాజ 4. రతిమన్మథనాటక 5. వసుమతీపరిణయనాటక 6. నిత్యోత్సవనిబంధ 7. భాస్కరవిలాసాదికృతికర్త యగు

తంజాపురనివాసి యనియు, రసగంగాధరకారుఁడగు పండితరాజజగన్నాథుని కంటె భిన్నుఁ డనియు గ్రహింపవలయును. అశ్వధాటీశతకకర్త యగు జగన్నాథకవి తన హృదయామృత కావ్యమునందుఁ గూడ నశ్వధాటీవృత్తములను వాడినాడు. అశ్వధాటీశతక మింతవఱకు ముద్రింపఁబడకుండుట మన దురదృష్టము. గుండు రామస్వామి శాస్త్రి గారి సీతాకల్యాణ చంపువునందు 'గంగావర్ణనము' ఉషాపరిణయనాటకము నందలి 'యంబాష్టకము' నశ్వధాటీనిబద్ధములు.

శ్రీ వాదిరాజపూజ్యచరణుల 'దశావతారస్తుతి' – 34 శ్లోకములు, రామచంద్రకవి 'దేవీనవరత్నమాలిక' (స్తోత్రసముచ్చయము – 71 పుట) మహాదేవకవి 'రామమత్తేభస్తోత్రము' స్తో. స–180 పుట), అజ్ఞాతకవి 'కమలాష్టకము' (స్తో. స. 289 పుట), భమిడిపాటి సుబ్రహ్మణ్యకవి 'వేంకటేశ్వరనవకము', 'సుబ్రహ్మణ్యనవకము', భమిడి లక్ష్మీనృసింహశాస్త్రి గారి 'సకలదేవతాస్తుతికదంబమంజరి' (273 అశ్వధాటీవృత్తములు – అముద్రితము) భమిడి కృష్ణావధాని 'గణేశస్తుతి', తిరుపతివేంకటకవుల 'కాళీస్తుతి', 'శ్రీకృష్ణస్తుతి' (కథలు – గాథలు – 1 భా – 349పుట), మళవళ్ళి కృష్ణపండితుల 'గౌర్యష్టకము' (30 – 9 – 74 సుధర్మ) పూర్తిగా నశ్వధాటీవృత్తనిబద్ధములు.

## తెలుఁగు వారి యశ్వధాటి

తెలుఁగు కావ్యములలో మొట్టమొదట నశ్వధాటీ వృత్తమును వాడిన వారు శ్రీవేంకటరామకృష్ణకవులు. వీ రాంధ్రవిశ్వగుణాదర్శచంపూకావ్యములో మూలానుగుణముగా నశ్వధాటిని వాడిరి.

కామాదివైరిగణభీమాతిలో – కనిజనామాఖిలాషగరిమున్
వైమానికార్యసమభూమున్ మనో – వచనసీమాతిలంఘిమహిమున్
శ్రీమాననీయకలసోమానను –న్విమలధామావమానితరవిన్
సేమంబు లియ్య వని పై మెండుగాఁ–జెలఁగ రామానుజున్ దెలచెదన్.

భేదాభిదా దురుపపాదార్థయు–గ్విషయవాదాపతద్ఘనమదో
త్సాదావహాద్భుతమఖాదాపగా–స్యదవినోదాభిజాతఫణితిన్
పాదారవిందనతఖేదాపలా–పచతురోదారమాధవగుణా
స్వాదాభి తుష్టియుతు మోదానఁగొ–ల్వరయ! వేదాంతదేశికమణిన్.

ఇక్కడ వేంకటరామకృష్ణకవులు సర్వత్ర ప్రాసయతితో పాటు ప్రతిపాదమునందు 12వ స్థానములో యతినియతిని గూడఁ బాటించిరి.

ఆంధ్రభాషయందుఁబ్రాసనియమము లేని సీసాదులందుఁ బ్రాసయతి యంగీకరింపఁ బడుట వల్లను (మంజరీద్విపదయందుఁ బ్రాసనియమము లేక పోయినను బ్రాసయతి చెల్లదు) వృత్తములలో నాల్గు పాదములందును బ్రాసనియమ ముండుట వల్లను, ప్రాసనియతి తోపాటు ప్రాసయతులు గల లయగ్రాహి, లయవిభాతి మొదలగు వృత్తములలో యతినియతి లేకుండుట వలన నశ్వధాటిలోఁగూడ 12 తావులందుఁబ్రాసయతి యుండుట వలనను బ్రతిపాదమునందు యతినియతి లేక పోయినను క్షతి లేదు.

అందు వల్లనే శ్రీపోతరాజు లక్ష్మీనృసింహకవి మాఘపురాణములో నశ్వధాటి యందు సర్వత్ర ప్రాసయతిని బాటించి యతిని విడిచిపెట్టిరి.

బాణాసురావనధు – రీణా! సదాసుహృద – రీణార్థసౌఖ్యదఘృణా!
బాణాయితాద్రిధర! – తూణాయితాబ్ధివర! – వీణామునిస్తుతగుణా!
ఏణాంకధారి! సుమ – బాణాసనారి! గిరి – బాణాసనా! వృషభకం
ఖాణా! శ్రితాఘహిమ – శోణామరా! గిరిశ – కోణాధిపా! ఫణిగుణా!
(మాఘపురా – 3 – 34)

ఈమాఘపురాణమునందు 10 అశ్వధాటులు గలవు. అచ్చతెనుఁగులో నడచిన యీ యశ్వధాటిని దిలకింపుఁడు –

ఏఱున్ దల న్నిలిపి – యూరున్ మలన్ సలిపి – పేరున్ గడించు పబువా!
పోరున్ దినన్ దిరుగు – పాఱున్ దివిన్ బెరుఁగు – గౌరున్ మెయి న్నగు దొరా!
యేరున్ నినున్ దొరయు – వా రుండ రంచుఁ బలు – మాఱున్ దొసంగడఁచు నీ
పేరున్ దలంచుచు జొ – హారున్ బొనర్తుఁ గొల – బారున్ దొలంచు బెరిమన్.
( మా. పు – 3 – 37)

శ్రీమిన్నికంటి గురునాథశర్మ గారి గురుభాగవతములో నచ్చతెలుఁగులో నున్న యీ యశ్వధాటి నడక లోని సొగసులను బరికింపుఁడు.–

మింటన్ సిగన్ నుదుటి – కంటన్ సెగన్ గఱకు – వింటన్ హరి న్నిలిపి మే
నంటన్ వెలంది మల దంటం జెలంగి నెన – రుంటం బస ల్కులుకు క్రే
గంటన్ జగం బరయు – చుంటన్ మదిన్ దెలిసి – కొంటం గడున్ బెరిమ ము
క్కంటిన్ నినున్ దలఁచు – చుంటిన్ వడిన్ మనుపు – మంటిన్ గొనంబుల గనీ!

అందువల్లనే నేను గూడఁ బ్రతిపాదమునందు యతినియతిని విడిచి సర్వత్ర ప్రాసయతులను గైకొని వేంకటరామయశోవికాస – శివమాహాత్మ్యఖండములలో నశ్వధాటీవృత్తములను రచించితిని.

అక్షాంఘ్రిసాంఖ్యకణ - భక్షాదిదర్శనస - మీక్షాఖిలక్షణునకున్
శిక్షాశ్రితశ్రుతిప - రీక్షాధికారిపద - వీక్షావిచక్షణునకున్
సాక్షాద్బృహస్పతికి - దక్షాత్రిశంఖమను - పక్షాభిరక్షణునకున్
దీక్షాకృతాధ్వరజలక్షాళితాఘునకుఁ - బ్రేక్షావిలక్షణునకున్.
(వేం. య. - 107)

లింగా! విభూషితభు - జంగా! జటాకలిత - గంగా! కరాబ్జధృతసా
రంగా! చతుశ్శ్రుతితు - రంగా! ధరాతలశ - తాంగా! విముక్తివనితా
సంగా! విశుద్ధధవ - ళాంగా! జగద్భరణ - చంగా! ప్రపూరితకృపా
పాంగా! విచారభవ - భంగా! శివాయుతశు - భాంగా! నతుల్ పురహరా!
(సూతసంహిత-శి.మా. ఖం - 71)

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

*13 - 10 - 1987* ⁕

ఈ వ్యాసము నింతవఱకు రచించిన పిమ్మట మఱికొన్ని యశ్వధాటీ రచనలు లభించినవి.

**(1) వేంకటాధ్వరి (17శ)**

ఇతఁడు విశ్వగుణాదర్శములో రెం డశ్వధాటీపద్యములను ‘ హస్తగిరిచంపువు’లో నొక యశ్వధాటిని వాడినాఁడు.

వందామహే తదర-విందాసనప్రమద-సందాయిమందహసితే! (హస్తి. చం -1-67)

**(2) నారాయణగురువు (1856 - 1928)**

వీరు సంస్కృత - మలయాళ - తమిళభాషలలో మంచి విద్వత్కవులు. వీరి సంస్కృతలఘుకృతులు 2006లో నొక సంపుటముగా వెలువడినవి. వీనిలో ‘షాణ్మాతురస్తవము’ (9 శ్లో) అశ్వధాటీవృత్తనిబద్ధము.

**(3) బెల్లంకొండ రామరాయకవి (1875 - 1914)**

అపరశంకరులు శతాధికగ్రంథకర్తలు నగు శ్రీబెల్లంకొండ రామరాయకవీంద్రులు శ్రీకృష్ణలీలాతరంగిణిలో నాఱవతరంగములో 282 అశ్వధాటీ పద్యములను రచించినారు.

**(4) గలగలీ రామాచార్యులు (1893)**

‘మధురాంజలి’ యనునది రామాచార్యుల కృతిసంగ్రహము. దీనిలో

---

*⁕ ఇంతవఱకు నీవ్యాసము రాజమండ్రి - సమాలోచనపత్రిక (1-1-1988) లోఁ బ్రచురింపబడినది.*

(1) శ్రీవేంకటేశ్వరాష్టకము (2) అశ్వధాటీకావ్యము – 34శ్లోకములు
(3) శ్రీగురు సార్వభౌమస్తవనాష్టకము నశ్వధాటీఛందములో రచింపఁబడినవి.

**(5) లంకా సీతారామాశాస్త్రి (1976)**

వీరు సీతారామాయణమును బూర్తిగా నశ్వధాటీఛందములో నిబంధించినారు. ప్రతికాండమునందు – ‘ ఓం – త – స – ’ అను గాయత్రీ మంత్రాక్షరములతో శ్లోకము లారంభింపఁబడినవి. కాండమునకు 25 శ్లోకములు చొప్పున మొత్తము 150 అశ్వధాటీ పద్యములు గలవు. శ్రీరామకథ యంతము సంగ్రహముగాఁ బూర్తియైనది. సీతారామశాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో 25 గ్రంథములు రచించిన విద్వత్కవులు.‘వేదాంతసంగ్రహము’ బెల్లంకొండరామరాయకృతి కాంధ్రానువాదము.

ఇవి నాకుఁ దెలిసినవి. ఇవికాక మఱికొన్ని యశ్వధాటీ కృతు లుండ వచ్చును.

## అశ్వధాటీ కావ్యము

ఇది ప్రస్తుతము పాఠకులు పఠించుచున్న కావ్యము. దీనిలో 25 పద్యములు గలవు. పద్యము లన్నియు దేవతాస్తుతి పరములు. భక్తి – జ్ఞాన – వైరాగ్య ప్రబోధకములు.

ఈ కావ్యమును రచించిన పండితేంద్రజగన్నాథుడు రసగంగాధరకర్త యగు జగన్నాథ పండితరాయల కంటె భిన్నుఁడు.

**జగన్నాథ పండితరాయలు (17శ.)**

(1) గంగాలహరి (2) అమృత (యమునా) లహరి (3) కరుణా (విష్ణు)లహరి (4) లక్ష్మీలహరి (5) సుధా(సూర్య)లహరి (6) భామినీవిలాసము (7) ఆసఫవిలాసము (8) ప్రాణాభరణము (9) జగదాభరణము (10) శబ్దకౌస్తుభశాణోత్తేజనము (అలభ్యము) (11) మనోరమాకుచమర్దనము (12) రసగంగాధరము (13) చిత్రమీమాంసాఖండనము (14) యమునావర్ణనచంపువు నను గ్రంథములను రచించినవాఁడు. ఇతని తల్లి ‘లక్ష్మి’, తండ్రి ‘పేరు భట్టు’.

**శ్లో॥ పాషాణాదపి పీయూషం స్యందతే యస్య లీలయా ।**
**తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతమ్ మహాగురుమ్॥** అని రసగంగాధరము.

ఇతఁడు షాజహాను (1628 – 1658) ఆస్థానకవి. ఇతనికిఁ ‘బండితరాజ’ బిరుదమును షాజహానే యిచ్చినాఁడు.

'శ్రీసార్వభౌమసాహిజహాన ప్రసాదా దధిగత పండితరాయపదవీవిరాజితేన' – అని యాసఫవిలాసములోఁ జెప్పుకొనినాఁడు. కాఁబట్టి యితని జీవితకాలము 1590 – 1670. వీరి యింటిపేరు 'ఉపద్రష్ట' వారని ప్రసిద్ధి.

**పండితేంద్ర జగన్నాథుడు (18 శ.)**

ఇతఁడు తంజావూరు నివాసి.'తంజాపురేశి నవకంజాక్షి' యని యశ్వధాటీకావ్యము. తంజావూరు నేలిన శరభోజీ (1711 – 1728) ఏకోజీ (1735) మహారాజుల యాస్థానకవి. ఇతని తండ్రి బాలకృష్ణుఁడు. తల్లి లక్ష్మి. వీరిది విశ్వామిత్రగోత్రము.

**శ్లో॥ అన్యేంద్రం జగ దస్థితేంద్ర మపి వా కర్తుమ్ ప్రగల్భేఽన్వయే**
**సంభూతో నను బాలకృష్ణసచివోత్తంసస్య రూపాంతరమ్ ।**
**లక్ష్మ్యంబాహృదయాంబుధే ర్హిమరుచిః ప్రాజ్ఞైః ప్రశస్యా మిమామ్**
**ప్రాణైషీ త్సుమతి ర్యథామతి జగన్నాథాభిధానః కృతిమ్॥** (భా.వి – 11)

అని భాస్కరవిలాసములో స్పష్టముగాఁ గలదు. ఈ బాల కృష్ణుఁడు తంజావూరు మహారాజులకు మంత్రిగా నుండెను. వీరి యింటి పేరు 'శ్రుతపేటవ' వారు.

ఈ జగన్నాథుని విద్యాగురువు 'కామసూరి'.

**శ్లో॥ అధిమహి మహితమహిమ్నో**
**వందేమహి కామసూరిగురుచరణాన్।**
**పరమకృపానిధిభి ర్యైః**
**పరిహృత మస్మాక మేడమూకత్వమ్॥** (ఆర్యా – 3) అని యార్యాస్తవరాజము.

మంత్రదీక్షాగురువు లలితాసహస్రనామభాష్యకర్త యగు భాస్కరరాయలు.

'ఇతి శ్రీవిశ్వామిత్రమహర్షిగోత్రపయోధికైరవమిత్రస్య
శ్రీమద్భాస్కరరాయభారతీదీక్షితాగ్నిచిదంతేవాసితా
సనాథస్య జగన్నాథస్య కృతి ర్భాస్కరవిలాసకావ్య మిదమ్
భువనాభోగాఖ్యాతం సంపూర్ణతా మయాసీత్॥' అని భాస్కరవిలాసగ్రంథాంతగద్యము.

శ్రీభాస్కరరాయలు లలితాసహస్రనామభాష్యమగు 'సౌభాగ్యభాస్కరములో' జగన్నాథ పండితరాయల గంగాలహరి నుదాహరించినారు.

'లక్ష్యరోమలతాధారతాసమున్నేయమధ్యమా'

అను లలితానామమునకు భాష్యములో యతివిచారసందర్భములో – యద్యపి –

**శ్లో॥ 'నిరాధారో హా రోదిమి కథయ కస్యాద్యపురతః'** (గంగా - 4శ్లో)

(కేషా మిహ పురః – ఇతిగంగాలహరీపాఠః) ఇత్యాదా విప స్వాన్యతర భాగానేకవర్ణాయాః పదమధ్యయతేః సాధుతాయాః సముద్రాద్యంతస్థానపరత్వేనైవవ్యస్థితత్వాత్, పాదాంతయతేః

**శ్లో॥ 'ప్రణమత భవబంధక్లేశనాశాయ నారా**
**యణచరణసరోజద్వంద్వ మానందదాయి'**

ఇత్యాదా వివాధారతేత్యస్య మధ్యే న సాధుత్వం, తథాపి రాతమాండవ్యాదిమునీనాం ఛందశ్శాస్త్రప్రవర్తకానామ్ ప్రాచా మాచార్యాణాం చ మతే యతే రనంగీకారాత్ తద్రీత్యా సాధుత్వ ముపపద్యతే। పైంగలం తు కలియుగీయగ్రంథమాత్రపర మితి ప్రదర్శితం ఛందోభాస్కరేఽ స్మాభిః॥'

దీనిని బట్టి శ్రీభాస్కరరాయలు జగన్నాథపండితరాయల తరువాతి కాలములో నున్నవారు. వీరి శిష్యుఁడగు పండితేంద్ర జగన్నాథుడు కూడఁ దరువాతి కాలము వాఁడే కదా! అశ్వధాటీ కావ్యకర్త 'ఇతి పండితేంద్ర జగన్నాథకవి విరచిత మశ్వధాటీకావ్యమ్' – అని చెప్పుకొన్నట్లే

**శ్లో॥ లక్ష్మీకాంతపదాంభోజమ్ ప్రణమ్య శ్రేయసామ్ పదమ్ ।**
**పండితేంద్రో జగన్నాథః స్యతి గర్వం గరుద్రుహామ్ ॥**

అని జగన్నాథపండితరాయలు కూడ మనోరమాకుచమర్దనములోఁ జెప్పుకొనినాఁడు.

అయినను రసగంగాధరకర్తకుఁ 'బండితరాజ' బిరుదము; అశ్వధాటీ కావ్యకర్తకుఁ బండితేంద్ర బిరుదము రూఢములు.

భాసురానందనాథదీక్షానామధేయు లగు శ్రీభాస్కరరాయలు సుమారు 40 గ్రంథములు రచించినారు. వీరి లలితాసహస్రనామ భాష్యము. క్రీ.శ. 1728 లో; సేతుబంధము క్రీ.శ. 1733 లో; చండీ సప్తశతీటీక యగు 'గుప్తవతి' క్రీ.శ. 1750లో రచింపఁబడినవి. వీరి శిష్యుఁ డగు పండితేంద్ర జగన్నాథుఁడు తన గ్రంథములను 1720 – 1750 మధ్యకాలములో రచించినాఁడు. కాఁబట్టి వీరి యిరువురి కాలము 18వ శతాబ్దము. పండిత రాయజగన్నాథకాలము 17వ శతాబ్దము. కాఁబట్టి యీ జగన్నాథు లిరువురు భిన్నులు.

ఈ విషయమును రసగంగాధరోపోద్ఘాతములో భట్ట మధురానాథ శాస్త్రిగారు కూడ స్పష్టముగాఁ జెప్పినారు – "అశ్వధాటీ – రతిమన్మథ – వసుమతీపరిణయకర్తా తంజౌరనగర వాసీ జగన్నాథః... ... శరభరాజ విలాసకర్తా జగన్నాథః... అయం జగన్నాథోఽపి తంజౌర నగర వాస్తవ్య ఆసీదితి రతి మన్మథాది ప్రణేతు ర్న భిన్న ఇతి భాతి...... ఇత్యాద్యా బహవో జగన్నాథ నామానః పండితాః సమభూవన్; తే సర్వేఽపి పండిత రాజాద్ భిన్నా ఇతి జ్ఞేయమ్॥" (రసగం – ఉపో – 49, 50 పుటలు).

పండితేంద్ర జగన్నాథుఁడు భాస్కరరాయల యొద్ద మంత్ర దీక్షను బొందిన పిమ్మట – 'ఉమానందనాథుఁ' డను దీక్షా నామమును గైకొనినాఁడు.

## పండితేంద్ర జగన్నాథుని కృతులు

ఇతఁడు జగన్నాథ నామముతో 1.వసుమతీ పరిణయ నాటకము (1720); 2.శరభరాజవిలాసము (1735); 3.రతిమన్మథనాటకము (1736); 4.అశ్వధాటీ కావ్యము; 5.ఆర్యాస్తవరాజము (1750)

ఉమానందనాథుఁ డను దీక్షానామముతో 6.హృదయామృతము (1742); 7.నిత్యోత్సవనిబంధము (1745); 8.భాస్కరవిలాసము (1750) నను గ్రంథములను రచించినాఁడు. ⁕

**ఆర్యాస్తవరాజము:**

ఇది 154 ఆర్యాపద్యములలో రచింపఁబడిన శివస్తవము.

**శ్లో॥ శిరసా నమాంసి తస్మై, సాంబాయ వితన్మహే మహేశాయ ।**
**సంగిరతే యస్య నమః, శేషిత్వ మకృత్రిమోఽపి వాగ్గుంభః ॥**
అనునది ప్రథమ శ్లోకము.

**శ్లో॥ అనుదిన మావర్తయతా, మార్యాస్తవరాజ మేన మిహ పుంసామ్ ।**
**ఐహిక మాముష్మిక మపి, యన్మూల మసౌ శివప్రసాదః స్యాత్ ॥**
అనునది చివరి శ్లోకము.

గ్రంథాంతములో నిట్లు చెప్పినాఁడు –

**శ్లో॥ చోళేశ మంత్రి చంద్రా, నందమఖీంద్రానుకంపయా భూష్ణుః ।**
**అనుగృహ్యతాం రసజ్ఞై, రస్య కవిః పండితో జగన్నాథః ॥**

ఈ శ్లోకమును బట్టి యీ గ్రంథ మానందరాయమఖి ప్రేరణచే రచింపఁబడినట్లు తెలియుచున్నది. ఈ యానందరాయమఖి తంజావూరు నేలిన శరభోజీ – తుక్కోజీ మహారాజులకు మంత్రియై 1.విద్యాపరిణయనము 2.జీవానందనము నను రెండు నాటకములను రచించినాఁడు. విద్యాపరిణయనము వేదాంతశాస్త్రమునకు సంబంధించిన 7 అంకముల నాటకము. జీవానందనము వైద్యశాస్త్రమునకు సంబంధించిన 7 అంకముల నాటకము. ఈ జీవానందననాటకము శ్రీయుతు లీశ్వర సత్యనారాయణ శర్మగారిచేఁ

⁕ Introduction to Hrdayamrtam. Page 8. New catalogues catalogorum-vol.II-page 390.

దెనిఁగింపఁబడి తెనాలి – సాధన గ్రంథమండలి వారిచే (1967) ప్రకటింపఁబడినది. ఆర్యాస్తవరాజము శ్రీరంగము నందలి శ్రీవాణీవిలాస ముద్రణాలయము వారిచేఁ బ్రచురింపఁబడినది.

జగన్నాథకవి శరభరాజ విలాసములో శరభోజీ మహారాజ చరిత్రను వర్ణించి యుండును.

**భాస్కర విలాసము :**

ఈ కావ్యములో 113 శ్లోకములలో శ్రీ భాస్కర రాయల వారి జీవితచరిత్రము గలదు. భాస్కరరాయల గ్రంథము లన్నియుఁ బేర్కొనఁబడినవి.

**శ్లో॥ శ్రేయోమార్గనిరూపణాయ శరణాపన్నేషు బద్ధాదరా**
**దుర్వార ప్రతివాదిచక్రవిమలీకారప్రకారోత్తరాః ।**
**సాష్టాంగ ప్రణమన్నరేంద్రమకుటీరత్నప్రభామేదురాః**
**శ్రీమద్భాస్కరభారతీపదనఖజ్యోత్స్నాంకురాః పాంతు నః ॥**
అనునది మొదటి శ్లోకము.

**శ్లో॥ అనేన వాగధ్వరేణ సమారాద్ధా కథంచన ।**
**దయతాం దేశికాత్మా మే దేవీ శ్రీలలితాంబికా ॥**
అనునది కడపటి శ్లోకము.

ఈ కావ్యమునకు 'భువనాభోగ' మను నామాంతరము కలదు. ఈ భాస్కర విలాసము లలితాసహస్రనామభాష్య – సౌభాగ్య భాస్కరమునకు ముందు తిలకముగా బొంబాయి – నిర్ణయ సాగరమువారిచే 1914లోఁ బ్రకటింపఁబడినది. ఈ లలితాభాష్యమే మరల శ్రీతిరుమలతిరుపతిదేవస్థానము వారిచే యథాతథముగా 1985లోఁ బ్రకటింపఁబడినది.

**హృదయామృతము :**

ఇది శ్రీశంకరభగవత్పాదుల సౌందర్యలహరి వలె దేవీస్తోత్రాత్మకము. దీనిలో 1.ఉపక్రమ 2.మధురిమ 3.అర్థ 4.శబ్ద 5.స్వరూప 6.లీలా 7.విజ్ఞాపన 8.కుతూహల 9.ఉపదేశ 10.ఆనందములను 10 ఆస్వాదములు గలవు. ఇది 440 శ్లోకములు గల స్తోత్రకావ్యము. ఉపదేశ – ఆనందాస్వాదములలో హృద్యము లైన కొన్ని గద్యములు కూడఁ గలవు. సౌందర్యలహరిలో వలెనే హృదయామృతములోఁ గూడ మంత్రశాస్త్రరహస్యము లెన్నియో వెల్లడింపఁబడినవి. స్వరూపాస్వాదములో 78 శ్లోకములలో నమ్మవారి సౌందర్య వర్ణనము గలదు.

కొన్ని మచ్చు శ్లోకములు :

శ్లో॥ ఐందవ్యా కలయాంచితం కచభరే; మందస్మితాలంకృతం
వక్త్రే; సాంద్రదయంహృది; స్తనతటేతుంగం; నితంబే తతమ్ ।
పాదాబ్జే మృదులం; సశోణవసనమ్ బంధూక బంధుప్రభం
రూపం తావక మంబ! మంగళ మిదమ్ మే సన్నిధత్తాం సదా ॥ (స్వరూప–78)

శ్లో॥ హే సద్రూపిణి! హే చిదర్చిరుదయే! హే కామరాజప్రియే!
హే భండాసురహంత్రి! హేఽ ద్భుతనిధే! హేఽ నంగసంజీవిని! ।
హే విశ్వప్రసవిత్రి! హే సకరుణే! హే దీనరక్షామణే!
హే శ్రీమల్లలితాంబ! హే పరశివే! మామ్ పాహి డింభం నిజమ్ ॥

శ్లో॥ నమో హేమాద్రిస్థే! శివసతి! నమః శ్రీ పురగతే!
నమః పద్మాటవ్యాం కుతికిని! నమో రత్నగగృహే! ।
నమః శ్రీచక్రస్థేఽ ఖిలమయి! నమో బిందునిలయే!
నమః కామేశాంకస్థితమతి! నమస్తేఽంబ! లలితే! ॥ (విజ్ఞాపన–55, 56 శ్లో.)

ఈ హృదయామృతములోఁ గూడ రెం డశ్వధాటీ వృత్తములను వాడినాఁడు –

శ్లో॥ రాకానిశారమణ–నీకాశవక్త్రరుచి–పాకావధూతకమలా
శోకాపహ ప్రణత–లోకావలేః స్ఫుటద–శోకారుణాంగలతికా ।
ఏకాఽపి యా జగతి–నైకావికా భవతి–పాకారివందితపదా
లోకాయ మే నిజస–మాకారతాం దిశతు–సా కాఽపి చిత్సుఖలతా ॥

శ్లో॥ బాలార్కశోణరుచి–జాలార్ధచంద్రసమ–ఫాలాత్తరక్తతిలకా
నీలాలకా మహిత–శీలా జగజ్జనన–లీలానుసారికుతుకా ।
శూలాయుధాంతరను–కూలా మమాస్తు ధురి–కూలాతిలంఘికరుణా
హేలానిరస్తరిపు–వేలా జపారుణిమ–చేలా మహీధరసుతా ॥ (శబ్దా – 53, 54 శ్లో.)

కవియే గ్రంథరచనాకాలము నిట్లు చెప్పినాఁడు.

శ్లో॥ కల్యబ్దేషు గతేష్వగ్నిశ్రుతినాగాబ్ధిసంఖ్యయా ।
వత్సరే దుందుభౌ పూర్ణ మాసీ దేతన్నిబంధనమ్ ॥

అగ్ని = 3. శ్రుతి = 4. నాగ = 8. అబ్ధి = 4.

'అంకానాం వామతో గతిః' అను వచనము ననుసరించి కలి సంవత్సరములు 4843 అగును. అనగా. క్రీ. శ. 1742.

ఈ హృదయామృతము Oriental Research Institute, Mysore వారిచే 1980లోఁ బ్రకటింపఁబడినది.

***రతిమన్మథనాటకము:***

శ్రీమాడభూషికృష్ణమాచార్యు లిట్లు చెప్పుచున్నారు,

Jagannatha was the son of minister Balakrishna and Lakshmi and pupil of Kameswara. He was in the court of king Sarafojee of Tanjore (1711 - 1728 A.D). His Ratimanmath is a drama on Rati and Manmatha, and Vasumatiparinaya is another drama on the marriage of Vasumati.

( H.C.S.L.Page 661.)

ఈ కవి రచించిన రతిమన్మథ – వసుమతీ పరిణయనాటకములు, శరభరాజవిలాసము, నిత్యోత్సవనిబంధము నాకు లభింపలేదు.

అశ్వధాటీకావ్యము కొఱకన్వేషించుచుండఁగా 'సుభాషితరత్నాకరము' లో నిది లభించినది. దీనిని గోపాల నారాయణ అండ్ కో – బొంబాయి వారు 1913లోఁ బ్రకటించిరి. ఇది యప్పటికే చతుర్థసంస్కరణము. గ్రంథము మిక్కిలి శిథిలావస్థలో నున్నది. కాగితములు ముట్టుకొన్నచో ముక్కలగునట్లున్నవి. ఇందలి యశ్వధాటీకావ్యము కంటఁబడఁగనే యపరిమితమైన యానందము గల్గినది.

లయప్రధానమైన యొకే వృత్తములో 12 తావులలో నొకే ప్రాసాక్షరము వాడుచు నొక పద్యము రచించుటయే యెక్కువ కష్టము. అట్టి 25 పద్యములతో రసవంతముగా నొక లఘుకావ్యమును నిర్మించుట సామాన్యవిషయము గాదు. కవి ప్రాచీనుఁడు. కావ్యము మధుర మైనది. వృత్త మపురూప మైనది. దీని కొక తెలుఁగు వ్యాఖ్య రచింప వలె నని చూచి నప్పుడే కోరిక యుదయించినది. 10 సంవత్సరముల క్రిందటి సంకల్ప మిప్పుడు నెఱవేరినది.

దీనికి సంస్కృతములో దర్పణవ్యాఖ్య కలదు. వ్యాఖ్యాత కృష్ణపండితుఁడు. ఇది మిక్కిలి లఘుటీక. ప్రతిపదార్థము మాత్రము కలదు. అయినను నా కెక్కువ యుపకరించినది. కృష్ణపండితుఁడు వ్యాఖ్యానకాలము నిట్లుట్టంకించినాఁడు.

**శ్లో॥ గుణరత్నర్షిభూయుక్తే ప్రజాపతిసమాహ్వయే।**
**శాఖాధిమాసే భాద్రాఖ్యే గీష్పతౌ ప్రతిపత్తిథౌ।**
**అశ్వధాట్యా దర్పణాఖ్యా వ్యాఖ్యా కృష్ణేన నిర్మితా ॥**

గుణ – 3; రత్న – 9; ఋషి – 7; భూ – 1.

'అంకానాం వామతో గతిః' అను గణిత శాస్త్రసంప్రదాయముచే 1793 శకసంవత్సర మగును. ప్రజాపతి సంవత్సరాధిక భాద్రపదమాసము - పాడ్యమి - గురువారము నాఁడిది పూర్తి యైనది. 1793 శతాబ్దము క్రీ.శ. 1871 అగును.

నేను కూడ నీతెలుఁగు వ్యాఖ్యను నందననామసంవత్సరాధిక భాద్రపదమాసములో రచించుట యాదృచ్ఛికము.

## నవవీథీవ్యాఖ్య

దీనికీ పేరు పెట్టుట కొక కారణము గలదు. ఇది యశ్వధాటీ కావ్యము గదా! నవవీథి - క్రొత్తబాట యని యొక యర్థము. క్రొత్త గుఱ్ఱములకు దౌడు నేర్పుటకై రౌతులు 9 సంచారమార్గముల నేర్పరింతురు. వీనికి నవవీథు లని పేరు. వీనిని గూర్చి మాఘభూమికలో నిట్లు వివరించితిని.

"ఈ ధారలను బరిచయము చేయుటకై గుఱ్ఱముల కేర్పరచిన సంచారప్రదేశములకు వీథు లని పేరు.

**శ్లో॥ వీథ్య స్త్రిస్రోఽథ ధారాణాం లఘ్వీ మధ్యోత్తమాః క్రమాత్ ।**
**తాసాం స్యాద్ధనుషామ్నాన మశీతి ర్నవతి శ్శతమ్ ॥**
**లఘ్వీమధ్యోత్తమానాం తు వాజినాం వీథికాః స్మృతాః ।**
**నవానాం కథితా వీథ్యో దుష్టానాం క్రమణక్రమే ॥**

**అన్యేషా మపి సర్వత్ర గతి దార్ఢ్యార్థ మీరితాః ।**
**సమోన్నతా సా విష మాంబుకీర్ణా, శుద్ధా నతాగ్రా తృణ వీరుదాఢ్యా ।**
**స్థాణుప్రకీ ర్ణోపలసంప్రకీర్ణా, పార్శ్వోన్నతాఖ్యా నవధేతి వీథ్యః ॥**

**సర్వవీథీషు యో వాజీ దృఢశిక్షాసమన్వితః ।**
**తేన రాజా రణే నిత్యమ్ మృగయాయామ్ ముదం వ్రజేత్ ॥**

ఎనుబది ధనుస్సుల మధ్యదూరము గల వీథి 'లఘ్వి'. తొంబది ధనుస్సుల మధ్యదూరము గల వీథి 'మధ్య'. నూరు విండ్ల దూరము గల వీథి 'యుత్తమ'. ఈ వీథులు తొమ్మిది విధములు. 1.ముందు సమముగా నుండి వెళ్ళిన కొలఁది పర్వతము వలె నెత్తుగా నుండునది 'సమోన్నత'. 2.ఒక చోట నెత్తుగను మరియొక చోట లోఁతుగను గొన్నిచోట్ల గోతులుగను నుండునది 'విషమ'. 3.ఎగుడు దిగుడుగా నుండు క్రింది భాగము కనఁబడకుండ నీటితో నిండి యుండునది 'యంబుకీర్ణ'. 4.ఎగుడు దిగుడులు లేక సమముగా నుండునది 'శుద్ధ'. 5.పోయిన కొలఁది

సారంగము వలెఁ బల్లముగా నుండునది 'నతాగ్ర'. 6.గడ్డితోఁ బొదలతో నిండి యుండునది 'తృణవీరుదాఢ్య'. 7.మ్రోళ్ళతో నిండి యుండునది 'స్థాణుప్రకీర్ణ'. 8.శిలలతో నిండి యుండునది 'యుపలసంప్రకీర్ణ'. 9.ఒకప్రక్క లోఁతుగా నుండి మరియొక ప్రక్క నెత్తుగా నుండునది 'పార్శ్వోన్నత'. పెంకి గుఱ్ఱములను లొంగఁ దీయుటకు మంచి గుఱ్ఱములకు గతి దార్ఢ్యము గల్గుటకు నీనవవీథుల యందు శిక్షింపవలయును. అన్ని వీథుల యందు శిక్ష పొందిన గుఱ్ఱము రాజునకు యుద్ధము లోను వేఁట యందును సంతోషము గల్గఁజేయునని భోజుఁడు చెప్పినాఁడు.

**శ్లో॥ ఉరసాలీ వరశ్వాలీ పృథులో మధ్యనామకః ।**
**ఆలీఢః శోభనై రంగైః ప్రత్యాలీఢ స్తథాపరః ॥**
**ఉపధేనవ ఉక్తం చ పాదచాలీ చ సర్వగః ।**
**నిర్దిష్టా వీథయ స్త్వేతాః... ... ॥**

1.ఉరసాలి 2.వరశ్వాలి 3.పృథులము 4.మధ్యము 5.ఆలీఢము 6.ప్రత్యాలీఢము 7.ఉపధేనవము 8.పాదచాలి 9.సర్వగము. ఇవి నవవీథు లని కొందఱి మతము. (మాఘభూమిక – 87 పుట)

ఈ కావ్యమును గూర్చి చెప్పఁగనే దీనినిఁ బ్రకటించుటకు మిత్రులు **శ్రీరావిమోహనరావు** గారు వెంటనే యంగీకరించిరి. వీరు శతాధిక గ్రంథ ప్రకాశకులు. అనేక సంస్కృతగ్రంథ వ్యాఖ్యాతలు. సంతత సరస్వతీ సేవాపరాయణులు. 'రామోరా' లేఖినీ నామధేయులు. వీరికి నా కృతజ్ఞతాభినందనములు

సుభాషితరత్నాకరగ్రంథమును నా కందఁజేసిన మా మేనమామగారు **శ్రీహరి సత్య సూర్య ప్రకాశరావు**. B.Sc, M.Ed. గారికి నా నమోవాకములు.

నే నడిగిన వెంటనే ప్రత్యేకముగా 'యాదవాభ్యుదయ' కావ్యము కొని 'హేవాక' – శబ్దమున కప్పయదీక్షితవ్యాఖ్య యందలి యర్థమును దూరతంత్రీ శ్రవణములోఁ దెలియఁజేసిన యవధాని శిరోమణులు చిరంజీవులు **శ్రీ బొబ్బిలి శ్రీనివాసరావు గారికిఁ** గృతజ్ఞతాపూర్వకాశీస్సులు.

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

ఇట్లు

సకలసుకవిబుధజనవిధేయుఁడు,

**గరిమెళ్ళ సోమయాజులు శర్మ,**

పుష్పగిరి మహాసంస్థానపండితుఁడు.

అవిడి,
స్వస్తిశ్రీ నందనాధిక భాద్రపద
త్రయోదశీ బుధవారము,
29-08-2012

✻ ✻ ✻

ఓం

శ్రీరామచన్ద్రాయ నమః

# అశ్వధాటీ కావ్యమ్

పండితేంద్ర జగన్నాథ విరచితమ్.

శ్లో॥ అంకాఽఽదృతక్షితిజ-మంకాఽనభిజ్ఞశశి-శంకాకరాఽఽస్యసుషమం
టంకారిచాప మను-లంకాఽఽశరక్షతజ-పంకాఽవరూషితశరమ్ ।
త్వం కామదం విహిత-రంకాఽవనం దనుజ-కంకాలనోదిన మనా
తంకాయ వత్స! భజ!-తం కాలమేఘరుగ-హంకారహారివపుషమ్ ॥ ౧

శ్లో॥ మాగా మన స్త్వ మను-రాగాతిభూమి ముప-భోగా నవాప్తమనసా
మాఽగారదారసుత-యోగా న కిం బత వి-యోగాత్మకాః పరిణతౌ ।
యాగాది జన్యపర-భాగా అవిగ్రహా విభాగార్హశైల తనయం
వేగా దుపాస్వ! భవ-రోగాపహం విధృత-నాగాఽజినమ్ పురరిపుమ్ ॥ ౨

శ్లో॥ వాచా మరందమధు-మోచాసుధామధురి-మాఽఽచామదక్షరసయా
హా! చాపలా న్నరపి-శాచా నుపాసితు మ-నాచార కింను యతసే ।
కాచాయ మా వినట!-సా చాఽఽపదత్ర న సు-మోచాగ్రిమా కమపి తమ్
ప్రాచా ముపాస్య మభి-యాచాఽపవర్గసుఖ-మాచార్య మాశ్రితవటమ్ ॥ ౩

శ్లో॥ ఖంజాయితోఽ ధిమతి-గంజాపరోఽపి బత-సంజాయతేఽ త్ర ధనదః
సంజాఘటీతి గుణ-పుంజాయితస్య నతు-గుంజామితం చ కనకమ్ ।
కిం జాగ్రతీ జయసి?-కిం జానతీ స్వపిషి?-శింజాననూపురపదే!
తంజాపురేశి! నవ-కంజాక్షి! సాధు తది-దం జాతువా కిము శివే! ॥ ౪

శ్లో॥ ఆటీకసేఽంగ! కరి-ఘోటీపదాతిజుషి-వాటీభువి క్షితిభుజాం
చేటీభవం స్తదపి-శాటీ న తే వపుషి-వీటీ న వాఽధి వదనమ్ ।
కోటీరరత్నపరి-పాటీ భృశాఽరుణిత-జూటీవిధుం తనులసత్
పాటీరలిప్తి మిభ-ధాటీజుషం సురవ-ధూటీనుతామ్ భజ! శివామ్ ॥ ౫

శ్లో॥ పండావదగ్రిమ! పి-చండాఽవపూర్తి మను-రండావిధేయకుటిలో
ద్దండాఽవివేక ధని-చండాలగేహభువి-దండాఽఽహతిం కిమయసే?
ఖండాఽమృతద్యుతిశి-ఖండా ముపాస్వ! సుర-ఖండార్చితాఽంఘ్రికమలామ్
భండాసురద్రుహ మ-చండాత్మికాం చితి మ-ఖండాం జడాత్మసుఖదామ్॥ ౬

శ్లో॥ గాఢా త్వయా సపది-రాధాపురీ వసుని-బాధావబద్ధరతినా
సోఢా తథా తపన-గాఢాఽఽతపప్రసర-రూఢాతివృష్టివితతిః ।
మూఢాఽపి కిమ్ ఫల మ-గూఢా జరైవ శిర-సోఢా కుతో న వినుతో
ద్రోఢా జనే ర్జనిత-షోఢాముఖః సమితి-వోఢా స హాటకగిరేః ॥ ౭

శ్లో॥ దంతావలాఽశ్వభృతి-చింతాపరోఽసి బత-కిం తావతా? వద ఫలం
హంతాఽఖిలం క్వచన-గంతా తదేత దథ-సంతాప మంచసి పరమ్ ।
త్వం తాత! భావయ! దు-రంతా రమాఽ నవర-తం తామసః స్వపిహి మా
సంతారకం వినత-సంతానకం సపది-తం తావ దాశ్రయ! శివమ్ ॥ ౮

శ్లో॥ వందారులోకతతి-మందారపాదప మ-మందాయమానకరుణమ్
బృందావనోధపశు-బృందాఽవనమ్ ప్రణత-బృందారకం చరణయోః ।
నందాదృతం కుశల-సందాయి తత్కిమపి-కందాయితం శ్రుతిగిరాం
కుందాభకీర్తి ముచుకుందార్చితం హృది ము-కుందాహ్వయం స్మర మహః ॥ ౯

శ్లో॥ క్రోధాఽఽకులో విగత-బోధాఽన్వయోఽ సదను-రోధాఽనుగో న భవ భోః
సాధారణీ న ఖలు-బాధా భవస్య భువి-గాధా న మోహవసతిః ।
వేధా గురుశ్చ పటు-మేధా విభు ర్నహి ని-షేధాయ కర్మవితతే
రాధాయ తాత! హృది-రాధా విటాంఘ్రియుగ-మాధారతాం వ్రజ! ముదామ్॥౧౦

శ్లో॥ నానావిధే జనుషి-కా నామ సౌఖ్యయుజి-రానాకపృష్ఠ మపివా
జానాసి యద్విషయ-సూనారుచి ర్భవసి-దూనాశయో భృశతరమ్ ।
మానాతిగో విహిత-దానాధ్వరాది రిహ-కీనాశభీతిరహితో
మీనాయతాక్ష మథి-గానాదరం కలయ!-సూనాస్త్రజీవనహరమ్ ॥ ౧౧

శ్లో॥ సాపాయ మేత్య వపు-రాపాతరమ్య మను-తాపాదృతే సకుతుకం
ద్వీపా నగాహిషి స-మీపాతిగా నకృత-భీపాతఖేదగణనః ।
భూపా నసేవిషి సు-రూపాఽఽకృతేఽహహ న-తూపాగమం సుఖలవం
గోపాయ! మాం సపది-గోపాలధుర్య! తవ-కోపాయ నాఽస్మి విషయః ॥ ౧౨

శ్లో॥ కిం బాల! న స్ఫురతి?-సంబాధకమ్ భృశవి-డంబాస్పదమ్ పరిణతౌ
నింబాది తిక్తరస-సంబాధ మత్ర నను-బింబాధరావిలసితమ్ ।
లంబాలకాం ధుతవి-లంబాదరాం ఘుసృణ-జంబాలజాలవిలసద్
బింబా మనూనశశి-బింబాననాం సతత-మంబా ముపాస్స్వ సదయామ్ ॥ ౧౩

శ్లో॥ రంభాదిగాఢపరి-రంభాఽఽదరేణ సుచి-రం భావతోఽత్ర యజసే
త్వం భావయస్వ! కిము-శం భావ్యనేన జడ! సంభావితక్షయమిదమ్ ।
స్తంభా దుదిత్వర మ-హంభావతః కలయ!-జంభారిసంస్తుతపదం
తం భావుకప్రద మ-దంభాఽఽకులో నఖర-సంభారదారితరిపుమ్ ॥ ౧౪

శ్లో॥ రామాఽర్చితాఽంఘ్రిరభి-రామాఽఽకృతిః కృతవి-రామా సుపర్వవిపదాం
కామాఽర్తిహృ త్సఫల-కామా నిదేశరత-కామాఽఽది నిర్జరవధూః ।
భామా హరస్య నుత-భామా జపాసదృశ-భా మాననీయచరితా
సా మా మవ త్వఖిల-సామాదృతస్తుతి ర-సామాన్యముక్తిసుఖదా ॥ ౧౫

శ్లో॥ మాయా తవేయ మురు-గాయాఽవివేకనిధి-మాయామినీ కిమపి మా
మాయాసయ త్యకృత-జాయాతనూజధన-కాయాదిదోషకలనమ్ ।
సా యాతనా తు నిర-పాయా మతా జగతి-హా! యామి కం ను శరణమ్
మాయానివాస! పరి-పాయా నవాంబుధర-దాయాదదేహ! భగవన్ ॥ ౧౬

శ్లో॥ హారం దదాసి కుచ-భారం జిఘృక్షసి చ-సారంగచంచలదృశః
సా రంతు మిచ్ఛతి హి-జారం నిషేవ్య తవ-కా రంజనేహ ఘటతామ్ ।
స్మారం విహాయ మద-మారంభరమ్య మను-వారమ్ భజ! శ్రుతిగిరాం
సారమ్ మహేశ మవి-కారం జనుర్విలయ-పారమ్ ప్రయాస్యసి సఖే ! ౧౭

శ్లో॥ నీలాఽలకానయన-లీలావిమోహమయ-కీలాలరాశిజఠరే
వేలాఽతిలంఘు మను-వేలాఽవమజ్జి రిహ-తే లాఘవాయ నహి కిమ్? ।
కో లాభ? ఏష ఇతి-కోలాయితో జయసి-హాలాసమస్థిత వయః
కాలాఽహితం శమిత-హాలాహలం సతత-మాలాన యాత్మమనసా ॥ ౧౮

శ్లో॥ దావాఽనలార్చి రివ-తావా నయం తపతి-హా! వామ్యకృత్ కలి రహో!
కోవాఽ పర స్త్వదిహ-భో వాసుదేవ! మమ-యో వారయేత త మిమమ్ ।
సేవా విధాన భృశ-హేవాకసిద్ధముని-దేవాఽధునా చరణయో
ర్భావాఽఽనతాయ శిశు-భావాఽఽశ్రితాయ విత-రాఽఽవాసతాం నిజముదామ్॥ ౧౯

శ్లో॥ ఆశాభరేణ నిఖి-లాఽఽశాసు ధావన మ-థాఽఽశాతకుంభగిరి వా
క్లేశాఽఽవహం వివిధ-దేశాఽటనం ద్రవిణ-లేశాయ నాఽపి వవృతే ।
ఆశాఽతిదా మవితు-మాశాస్వ పాణిధృత-పాశా మనేక జగతా
మీశా ముపాసితగి-రీశా మిహాఽంగ! దిగ-ధీశాఽర్చితాఽంఘ్రినలినామ్ ॥౨౦

శ్లో॥ ఏషా జరా శిరసి-వేషాఽన్యభావకృ ద-శేషాఽఽమయైక వసతి
స్తోషాయ సౌమ్య! నహి-దోషాఽఽలయా భృశ మ-పోషాఽఽస్పదీకృతగుణా ।
శేషాయుషః కురు! వి-శేషాఽర్వ మేత దిహ-శేషాఽహిక్లప్తధనుషో
రోషాద్యపాస్య తను-శోషాఽఽవహం కలయ!-యోషా మనంగ జయినః ॥౨౧

శ్లో॥ సంసారధన్వభువి-కిం సార మామృశసి?-శంసాఽధునా శుభమతే!
త్వం సాధు సంతను హి-తం సాహసేన తు నృ-శంసాఽఽదృతేన కి మహో! ।
హంసాఽఽశయస్థ మతి-హంసాత్మభాస మథ-తం సామభిః పరిగృణన్
కంసారివంద్య మవ-తంసాయితేందు మిహ-సంసాధ యార్థమఖిలమ్ ॥ ౨౨

శ్లో॥ గేహాఽఽత్మజద్రవిణ-దేహాఽఽదికం జనిత-మోహాఽనుబంధ మవితుమ్
భో హాని రాపి కియ-తీహాఽపి సుస్థితిమ-తీహా న తే నిజహితే ।
వాహాయితోక్ష భవ-దాహాఽపహం సలిల-వాహాఽఽభకంఠసుషమమ్
బాహాలసన్మృగ మ-నాహార్యసౌఖ్యకర-మాహాత్మ్య మాభజ! మహః ॥ ౨౩

శ్లో॥ వాలీయుత శ్రవణ-పాలీయుగా లలిత-చూలీవిరాజిబకులా
కేలీగతానుగమ-రాలీకులా మధుర-మాలీభి రాదృతకథా ।
నాలీకదృక్ కుసుమ-నాలీకపాణి రిహ-కాలీయశాసిసహజా
తాలీదలాభతను-మాలీ సదా భవతు-కాలీ శుభాయ మమ సా ॥ ౨౪

శ్లో॥ దక్షాఽధ్వర ప్రశమ-దక్షాఽఽగ్రహం విబుధ-పక్షాఽభిపాలనపరం
లక్షాఽమృతద్యుతివ-లక్షాఽఽత్మకం హృతవి-పక్షాఽఽత్తవిస్మయకథమ్ ।
ఉక్షాధిరోహి హత-లక్షాఽసురప్రకర-మక్షామతాఽశ్రయదయమ్ ।
త్ర్యక్షాఽఽహ్వయమ్ ప్రణత-రక్షామణిమ్ ప్రణయి-యక్షాఽధిపం స్మర! మహః ॥ ౨౫

శ్లో॥ రామనామ్నః స్వపౌత్రస్య కామనాపూరణోత్సుకః ।
అశ్వధాటీం జగన్నాథో విశ్వహృద్యామరీరచత్ ॥

ఇతి పండితేంద్రజగన్నాథ విరచిత మశ్వధాటీకావ్యం సంపూర్ణమ్ ॥

శ్రీః శ్రీః శ్రీః

ఓం

శ్రీరామచన్ద్రాయ నమః

# అశ్వధాటీ కావ్యమ్ - నవవీథీ వ్యాఖ్య

## ౧. శ్రీరామ స్తుతి

*అవతారిక :*

జగన్నాథ పండితేంద్రుఁడు తన మనుమఁ డగు రామునకు బోధించుటకై వినినంతనే వీనులకు విందు చదివినంతనే మనస్సున కుల్లాసము గలిగించు లయ గల యశ్వధాటీ వృత్తములతో భక్తి - జ్ఞాన - వైరాగ్యముల నుపదేశించు నశ్వధాటీకావ్యమును రచింపఁ బూనినవాఁడై ప్రారంభించిన గ్రంథము నిర్విఘ్నముగా సమాప్తి నొందుటకై శ్రీరామభజనపూర్వక మగు మంగళము నాచరించుచున్నాఁడు.

**శ్లో॥ అంకాఽఽదృతక్షితిజ-మంకాఽనభిజ్ఞశశి-శంకాకరాఽఽస్యసుషమం**
**టంకారిచాప మను-లంకాఽఽశరక్షతజ-పంకాఽవరూషితశరమ్ ।**
**త్వం కామదం విహిత-రంకాఽవనం దనుజ-కంకాలనోదిన మనా**
**తంకాయ వత్స! భజ!-తం కాలమేఘరుగ-హంకారహారివపుషమ్ ॥** ౧

**వ్యాఖ్య :** వత్స = అబ్బాయీ! మనుమఁడ వగు రామా! అంక = తొడపై; ఆదృత = ఆదరింపఁబడిన; క్షితిజమ్ = భూమి నుండి పుట్టిన సీత గల వానిని; 'ఉత్సంగ చిహ్నయో రంకః' - అని యమరము. అంక = కళంకమును - మచ్చను; అనభిజ్ఞ = న+అభిజ్ఞ = ఎఱుఁగని; శశి = చంద్రుని యొక్క; శంకాకర = సందేహమును గలిగించు; ఆస్య = మోము యొక్క; సుషమమ్ = శోభ గల వానిని; 'కలంకోఽ ంకాపవాదయోః' - అని యమరము. శశము = కుందేలు. అది గల వాఁడు శశి. 'సృమరో గవయః శశః' 'ద్విజరాజో శశధరో నక్షత్రేశః క్షపాకరః' 'వక్త్రాస్యే వదనం తుండ మాననం లపనమ్ ముఖమ్' 'సుషమా పరమా శోభా' - అని యమరము. 'శంకా వితర్క భయయోః' - అని వైజయంతి. టంకారి = టంకార ధ్వని గల; చాపమ్ = విల్లు గల వానిని; అను = తరువాత; లంకా = లంకాపట్టణము నందలి; ఆశర = రాక్షసుల యొక్క; క్షతజ = గాయముల నుండి పుట్టిన రక్తము యొక్క; పంక = బురదచే; అవరూషిత = బాగుగాఁ గప్పఁబడిన; శరమ్ = బాణములు గల వానిని; 'ధను శ్చాపౌ' 'క్రవ్యాదోఽ స్రప ఆశరః' 'రక్త క్షతజ శోణితమ్' 'పంకోఽ స్త్రీ శాద కర్దమౌ' 'కలంబ మార్గణ శరాః-' అని యమరము. కామదమ్ = కోరిన కోరికల నిచ్చు వానిని,

'కామోఽభిలాష స్తర్షశ్చ' - అని యమరము. విహిత = విధింపఁబడిన = చేయఁబడిన: రంక = దీనుల యొక్క: అవనమ్ = రక్షణము గల వానిని: 'రంకః కృపణ మల్లయోః' - అని విశ్వ - మేదినీ - నానార్థరత్నమాలాకోశములు. రంకః = కృపణుఁడు, లోభి, దరిద్రుఁడు - అని మేదినీటీక. దీనుఁ డని దర్పణవ్యాఖ్య. దనుజ = దుందుభి యను రాక్షసుని యొక్క కంకాల = అస్థిపంజరమును: నోదినమ్ = దూరముగాఁ దన్నిన వానిని: 'స్యా చ్ఛరీరాస్థి కంకాలః' - అని యమరము. కాలమేఘ = నల్లని మబ్బుల యొక్క: రుక్ = కాంతుల యొక్క, అహంకార = గర్వమును: మేమే గొప్పవారమను నహంభావమును, హారి = హరించు - అణఁచివేయు: వపుషమ్ = దేహము గల వానిని:'కాల శ్యామల మేచకాః' 'అభ్రమ్ మేఘో వారివాహః' ' స్యుః ప్రభా రు గ్రుచిః' 'గర్వోఽ భిమానోఽ హంకారః' 'గాత్రం వపుః సంహననం శరీరమ్' - అని సర్వత్ర యమరము. తమ్ = ఆప్రసిద్ధుఁ డగు శ్రీరామచంద్రుని: న + ఆతంకాయ = ఆటంకములు లేకుండుటకై - యడ్డులు తొలఁగుటకై; నీవు; భజ = సేవింపుము.

'భజ - సేవాయమ్' అను ధాతువునకు లోట్టులో నేకవచనములో రూపము.

***తాత్పర్యము:*** ఓ వత్సా! ఒడిలో సీతను గూర్చుండఁ బెట్టుకొనిన వాఁడు, మచ్చ లేని చంద్రబింబమా? యను శంకను గలిగించు ముఖశోభ గల వాఁడు, 'టంటం' - అని మ్రోఁగు ధనుస్సుగల వాఁడు, లంక యందలి రాక్షసుల రక్తపు టొచ్చులోఁ గూరుకొన్న బాణములు గల వాఁడు, భక్తుల కోర్కెలు దీర్చు వాఁడు, దీనులను రక్షించు వాఁడు, దుందుభి యను రక్కసుని యస్థిపంజరమును గాలి బొటనవ్రేలితో దూరముగాఁ బడవేసిన వాఁడు, కాఱు మబ్బుల కాంతుల గర్వము నణఁచు నల్లని దేహము గలవాఁడు నగు శ్రీరామచంద్రు నాటంకములు పోవుటకై నీవు సేవింపుము.

***విశేషములు:***

తన యందు సుగ్రీవునకు నమ్మకము కల్గుటకై దుందుభి యను రాక్షసుని యెముకల గూడును శ్రీరామచంద్రమూర్తి తన పాదాంగుష్ఠముతో దశయోజనములు దూరముగా నెట్టిన రామాయణకథ యిక్కడ నను సంధేయము.

శ్లో॥ రాఘవ ప్రత్యయార్థం తు దుందుభేః కాయ ముత్తమమ్ ।
దర్శయామాస సుగ్రీవో మహాపర్వతసన్నిభమ్ ॥
ఉత్స్మయిత్వా మహాబాహుః ప్రేక్ష్య చాస్థి మహాబలః ।
పాదాంగుష్ఠేన చిక్షేప సంపూర్ణం దశయోజనమ్ ॥ (వాల్మీ-బాల-1-64, 65 శ్లో.)

రాఘవో దుందుభేః కాయమ్ పాదాంగుష్ఠేన లీలయా ।
తోలయిత్వా మహాబాహు శ్చిక్షేప దశయోజనమ్ ॥ (వాల్మీ-కిష్కి-11-84శ్లో.)

'అంకావరూషితశరమ్' అను ముద్రితపాఠము సాధువుగాదు. 'పంకావరూషితశరమ్' - అని యుండవలయును.

*ఛందస్సు:*

ఈ కావ్యమునందలి పద్యము లన్నియు నశ్వధాటీవృత్తములు. అశ్వధాటికే 'మత్తేభము' 'సితస్తబకము' 'పరిస్తబకము' మొదలగు నామాంతరములు గలవు.

మత్తేభ నామ కిల వృత్తేషు వృత్త మభిధత్తేస్మ కోఽపి కవిరాడ్
గౌర్నాగరో నగిరి నాగోపమోఽస్తి నచ వృత్తం సమాన మమునా ॥
అని శ్రీనివాసకవి వృత్తమణికోశలక్షణము.

ఉక్తం సితస్తబతవృత్తం తభౌ యజసరా నో గురు ర్యది తదా। అని దుఃఖభంజనకవి వాగ్వల్లభలక్షణము.

ఉక్తమితి - యది ప్రతిపాదం తగణ - భగణ - యగణ - జగణ - సగణ - రగణ - నగణ - గురవః స్యుః, తదా ' సితస్తబక' నామకం వృత్తమ్ ఉక్తమ్। శేషేణేతి శేషః। 'పరిస్తబక' ఇత్యపి నామాఽస్య బోధ్యమ్। 'అశ్వధాటీ' ఇత్యపి నామాస్య కేచిద్వదంతి॥

అని తత్పుత్ర దేవీప్రసాదశుక్లవరవర్ణినీవ్యాఖ్య.

అశ్వధాటీవృత్తములోఁ బ్రతిపాదమునందు -'త - భ - య - జ - స - ర - న - గ' - గణములు క్రమముగా వచ్చును. నాలుగు పాదము లందు 1- 8 - 15 స్థానములలో నొకే ప్రాసాక్షరమును వాడవలయును.

ఈ శ్లోకము కాళిదాసు రచించిన 'దేవీస్తుతి' లోని-

శ్లో॥ న్యంకాకరే వపుషి - కంకాళరక్తపుషి - కంకాదిపక్షివిషయే
త్వం కామనా మయసి - కింకారణం? హృదయ! పంకారి మేహి గిరిజామ్।
శంకాశిలానిశిత - టంకాయయానపద - సంకాశమానసుమనో
ఝంకారిభృంగతతి - మంకానుపేతశశి - సంకాశవక్త్రకమలామ్॥
అను శ్లోకమున కనుసరణము. ౧.

## ౨. లౌకికవస్తుయాగాదిగర్హణము - శివభజనము

**అవతారిక :**

లౌకికములగు భార్యాపుత్త్రాదులు, వైదికములగు యాగాదులు నిత్యములుగావు. నిత్యఫలప్రదుఁడైన శ్రీశివునే యుపాసింపు మని తన మనస్సునకు బోధించుచున్నాఁడు:-

**శ్లో॥ మాగా మన స్త్వ మను-రాగాతిభూమి ముప-భోగా నవాప్తుమనసా**
**మాఽగారదారసుత-యోగా న కిం బత వి-యోగాత్మకాః పరిణతౌ ।**
**యాగాది జన్యపర-భాగా అవిగ్రహ వి-భాగార్హశైల తనయం**
**వేగా దుపాస్స్వ! భవ-రోగాపహం విధృత-నాగాఽజినమ్ పురరిపుమ్ ॥** ౨

**వ్యాఖ్య :** మనః = ఓమనసా!; త్వం = నీవు; ఉపభోగాన్ = పువ్వులు, మంచి గంధము, చల్లని పానీయములు మొదలగు భోగవిషయములను; అవాప్తుమ్ = పొందుటకు; అనసా = బండిపై; 'క్లీబేఽనః శకటోఽస్త్రీ స్యాత్' - అని యమరము. అనః శబ్దము సకారాంతము, నపుంసకలింగము. లేక – అవాప్తుమనసా = పొందవలె ననెడి మనస్సుతో. 'తుం కామమనసో రపి' – అను వచనముచే మకారలోపము. అనురాగ = అనురక్తికి – కూరిమికి; అతిభూమిమ్ = పరాకాష్ఠ యైన ప్రదేశమునకు; మా గాః = వెళ్ళకుము.

ఎందులకు వారించుచున్నా వను దానికి సమాధానము చెప్పుచున్నాఁడు - మా = లక్ష్మి - సంపద; అగార = ఇల్లు; దార = భార్య; సుత = కొడుకు మొదలగు వాని యొక్క; యోగాః = సంయోగములు - పొందుటలు; పరిణతౌ = కాలక్రమపరిణామములో; వియోగాత్మకాః = వియోగమును - విడిపోవుటను గల్గించునవి. న కిమ్ = కావాయేమి? విడిపోవునవే యని భావము. బత = అయ్యో! చెప్పుము.' ఖే దానుకంపా సంతోష విస్మ యామంత్రణే బత' - అని యమరము.

స్వర్గసుఖము కూడ నిట్టిదే యని చెప్పుచున్నాఁడు-

యాగ + ఆది – యాగాది = జ్యోతిష్టోమము మొదలగు యజ్ఞములచే; జన్య = పుట్టు; పర = ఉత్కృష్టమైన; భాగాః = అమృతము, అప్సరసలు మొదలగు వాని వలనఁ గల్గు సుఖములు కూడ; అవసానకాలములో వియోగము నొందునవే యని పూర్వకవాక్యముతో నన్వయము. 'పదభాగాః' - అని పాఠాంతరము. పద మనఁగా స్వర్గము.

శ్లో॥ యన్న దుఃఖేన సంభిన్నం నచ గ్రస్త మనంతరమ్ ।
అభిలాషోపపన్నం చ తత్సుఖం స్వః పదాస్పదమ్ ॥ (గరుడ-109 అధ్యా-44 శ్లో.)

దుఃఖముతోఁ గూడనిది, తరువాతి కాలములోఁ గూడ దుఃఖమును గల్గింపనిది, యభిలాషము (కోరిక) వలనఁ బుట్టునది యగు సుఖమే స్వర్గము (స్వఃపదము) అని గరుడపురాణము చెప్పుచున్నది. అమృతపానము, రంభాసంభోగము, అజరత్వము (ముసలితనము లేకపోవుట) మొదలగునవి స్వర్గలోకములో లభించును. 'స్వర్గకామో యజేత' స్వర్గమును గోరువాఁడు యాగము చేయవలయు నని వేదము చెప్పుచున్నది. యాగములు చేయుట వలన స్వర్గము లభించును గాని యా స్వర్గసుఖములు కూడ శాశ్వతములు గావు.

శ్లో॥ తే తమ్ భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి॥ (భ.గీ. -9-21)

యాగములు చేసిన వారు స్వర్గము చేరి భోగము లనుభవించి యా యాగపుణ్యము క్షీణించినంతనే మఱల భూలోకములోఁబుట్టుచున్నా రని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ యుపదేశించుచున్నాఁడు.

కాఁబట్టి యీ భూలోకము నందలి ధన - గృహ - భార్యా - పుత్త్రాదుల వలనఁ గలిగిన సుఖములు శాశ్వతములు కానట్లే స్వర్గలోకమునందలి యమృతపాన - రంభాసంభోగాదులు కూడ శాశ్వతములు కావు కావున వానికై యఱ్ఱులు సాఁచ వలదని భావము.

అయినచో నేమి చేయవలయునో చెప్పుచున్నాఁడు -

అ + విగ్రహ + విభాగ + అర్హ + శైలతనయమ్.

విగ్రహ = దేహము నుండి; విభాగ = విడఁదీయుటకు; అ + అర్హ = శక్యముగాని; శైలతనయమ్ = పర్వతపుత్త్రిక యగు పార్వతి గల వానిని; అత్యంతానురాగముతో భార్యకు సగము దేహ మిచ్చిన శివుఁ డర్ధనారీశ్వరుఁ డగుటచే నాశివపార్వతు లెప్పుడు విడిపోవరని భావము.

భవ = పుట్టుక, సంసారము నను, రోగ = జబ్బును; అపహమ్ = అపహరించు - పోఁగొట్టు వానిని; విధృత = విశేషముగా ధరింపఁబడిన; నాగ + అజినమ్ = ఏనుఁగు చర్మము గల వానిని; పురరిపుమ్ = పురములకు శత్రువైన; త్రిపురాసురుల సంహరించిన పరమశివుని; వేగాత్ = శీఘ్రముగా - వెంటనే; ఉపాస్స్వ = ఉపాసింపుము.

తాత్పర్యము: ఓ మనసా! నీవు భోగద్రవ్యములను సంపాదించుటకై యనురక్తితో బండి యెక్కి దూరదేశములకుఁ బయనింపకుము. నీవు సంపాదించిన ధనము - ఇల్లు - భార్య - కొడుకులు చివరకు శరీరము కూడ నంత్యకాలములో మనల నుండి విడిపోవునవే.

శ్లో॥ ధనాని భూమౌ పశవశ్చ గోష్ఠే - భార్యా గృహద్వారి జనః శ్మశానే ।
దేహ శ్చితాయామ్ పరలోకమార్గే - స్వకర్మగో గచ్ఛతి జీవ ఏకః ॥

మనము సంపాదించిన ధనములు భూమి యందే యుండును. ఆవులు, గేదెలు మొదలగు పశుసంపద సాల యందే యుండును. మన తోడి జనులు వల్లకాటి వఱకే వత్తురు. పుట్టుకతో వచ్చిన శరీరము చితి యందే మండి పోవును. జీవుఁ డొక్కడే తాను చేసిన పుణ్యపాపకర్మములతోఁ బరలోకమార్గములోఁ బ్రయాణము చేయు నను వచనము ప్రసిద్ధమే కదా! కాఁబట్టి యీ భోగము లన్నియుఁ జివరి గడియలలో వియోగమును బొందునవే. ఇహలోకసుఖము లశాశ్వతము లైనచో యజ్ఞయాగాదులు చేసి స్వర్గలోకసుఖము లనుభవింపవచ్చును గదా! యన్నచో నవి గూడ శాశ్వతములు గావు. జీవుఁడు చేసికొన్న పుణ్యము తరిగి నంతనే మఱల భూలోకములోఁ బుట్టవలయును. ఐహిక సుఖములు, పారలౌకికసుఖములు నన్నియు నశాశ్వతములే. భగవంతుఁ డొక్కఁడే శాశ్వతుఁడు. భగవత్సాయుజ్యమే శాశ్వతమైనది. కాఁబట్టి పార్వతి నర్ధాంగిగాఁ జేసికొన్నవాఁడు, చావుపుట్టుకలతోఁ గూడిన సంసారరోగములను నయము చేయువాఁడు, ఏనుఁగుతోలే బట్టగా ధరించినవాఁడు, త్రిపురములకు - స్థూలసూక్ష్మకారణదేహములకు శత్రువు - త్రిపురాసురులను సంహరించినవాఁడు నగు పరమశివుని వేగముగా సేవింపుము. కైలాసము చేరి శాశ్వత మగు శివసాయుజ్యము నొందెద వని భావము.

శివుఁడు గజాసురుని సంహరించి వాని చర్మమును బట్టగా ధరించిన కథ, బంగారు - వెండి - యినుపపట్టణములు గల త్రిపురాసురులను జంపి లోకములను రక్షించిన కథ భారత-భాగవత - శివపురాణములలోఁబ్రసిద్ధములు. ౨.

## ౩. నరసేవాగర్హణము - శ్రీదక్షిణామూర్తిప్రార్థనము

***అవతారిక :***

భగవంతుఁ డిచ్చిన మధురమైన వాక్కుతో నరపిశాచులను స్తుతించుట మంచిది కాదు. శ్రీదక్షిణామూర్తినే నుతింపు మని యుపదేశించుచున్నాఁడు-

**శ్లో॥ వాచా మరందమధు-మోచాసుధామధురి-మాఽఽచామదక్షరసయా**
**హా! చాపలా న్నరపి-శాచా నుపాసితు మ-నాచార కింను యతసే ।**
**కాచాయ మా వినట!-సా చాఽఽపదత్ర న సు-మోచాగ్రిమా కమపి తమ్**
**ప్రాచా ముపాస్య మభి-యాచాఽపవర్గసుఖ-మాచార్య మాశ్రితవటమ్ ॥** ౩

***వ్యాఖ్య :*** న + ఆచార - అనాచార! = ఆచారము లేని జీవుఁడా! మరంద = పువ్వుల నుండి

పుట్టిన తేనె; మధు = తేనెటీఁగలు పెట్టుతేనె; మోచా = అరఁటిపండు; 'కదళీ వారణబుసా రంభా మోచాంశుమత్ఫలా కాష్ఠీలీ' – అని యమరము. సుధా = అమృతము; 'పీయూష మమృతం సుధా' – అని యమరము. వీనికి సంబంధించిన; మధురిమా = తీపిని; ఆచామ = భక్షించుటలో; దక్ష = సమర్థమైన; రసయా = రసము గల; వాచా = వాక్కుచే; కవుల పలుకులు మకరందాదిరసముల కంటెను దియ్యనైన వని భావము హా! = అయ్యో! నరపిశాచాన్ = మానవరూపములో నున్న పిశాచములను; ఉపాసితుమ్ = ఉపాసించుటకు – రంజింపఁజేయుటకు; కిన్ను యతసే? = ఏల ప్రయత్నము చేయుచున్నావు? కాచాయ = గాజు ముక్కకై – గాజుపెంకు వలెఁ దుచ్ఛమైన ధనమునకై; మా వినట = ఆనరపిశాచముల ముందు వికటముగా నృత్యము చేయకుము. అగ్రిమా = ముందున్న; ఆపత్ = మరణాదిరూప మైన యా యాపద; అత్ర = ఆనరపిశాచముల దగ్గఱ; న సుమోచా = విడిచిపెట్టుటకు – మరణాదియాతన నుండి తప్పించుకొనుటకు శక్యము గాదు. కాఁబట్టి; ప్రాచామ్ = ప్రాచీను లైన బ్రహ్మ, విష్ణువు మొదలగు వారికిఁగూడ; ఉపాస్యమ్ = ఉపాసింపఁదగిన వానిని; ఆశ్రితవటమ్ = ఆశ్రయింపఁ బడిన మఱ్ఱిచెట్టు గల వానిని; మఱ్ఱిచెట్టు క్రింద నున్న వానినని భావము. ఆచార్యమ్ = జగద్గురు వైన వానిని; కమ్ అపి – కమపి = ఒకానొక యనిర్వచనీయుఁ డైన శ్రీదక్షిణామూర్తిని; అపవర్గసుఖమ్ = మోక్షసౌఖ్యమును; అభియాచ = బాగుగా యాచింపుము. మోక్షము కొఱకై శ్రీదక్షిణామూర్తినిఁ బ్రార్థింపుము.

**తాత్పర్యము :** వేదశాస్త్రాచారములు లేని యో జీవుఁడా! పూలతేనె, పట్టుతేనె, అరఁటిపండు, అమృతము మొదలగు వాని తీపిని మించిన మాధుర్యము గల వాక్కులతో నరపిశాచముల నుపాసించుట కెందులకుఁ బ్రయత్నించుచున్నావు? ధనము కోసమే కదా! ఇదంతయు నీ చపలత్వము. నీవు మూర్ఖుఁడవు. వారి యొద్ద నుండి ధనము సంపాదించి యజ్ఞాదిపుణ్యకర్మములు చేసి పాపమును బోఁగొట్టుకొని యాపదల నుండి బయటపడుటకుఁజేయుచున్నా నన్నచో నీద్రవ్యము వలన స్వల్పపాపములను నశింపఁ జేసికొనఁ గలవు గాని నీకు దగ్గఱగాఁ బొంచి యున్న మరణాదిరూప మగు గొప్ప యాపద నుండి తప్పించుకొన లేవు. ఈ నరాధము లిచ్చు ధనము గాజుపెంకు వంటిది. దీని వలన నీ జననమరణ రూపములగు కష్టములు తీరవు. కావున నీసామాన్య నరుల ముందఱ స్తుతించుచు నాట్యము చేయుట మానుము. నీ యాపదలు తొలఁగుట కేమి చేయవలయునో చెప్పుచున్నాను వినుము! బ్రహ్మ మొదలగు దేవతలకుఁ గూడ సేవింపఁదగిన వాఁడు, ముజ్జగములకు నాచార్యుఁడు, మఱ్ఱిచెట్టు మూల నాశ్రయించిన వాఁడు నగు నొకానొక యవ్యక్తస్వరూపుని శ్రీదక్షిణామూర్తి నపవర్గసుఖమునకై ప్రార్థింపుము. నీకుఁ దప్పక కైవల్యము లభించు నని తాత్పర్యము.

***విశేషములు:-***

ఆచార్యః – 'మంత్రవ్యాఖ్యాకృదాచార్యః'వేదమంత్రములను వ్యాఖ్యానము చేయువాఁ డాచార్యుఁ డని యమరకోశము.

శ్లో॥ ఉపనీయ తు యః శిష్యం వేద మధ్యాపయేద్ ద్విజః ।
సకల్పం సరహస్యం చ తమాచార్యమ్ ప్రచక్షతే ॥ (మను - 2 - 140)

శిష్యునకు వడుగు చేసి షడంగములతో నుపనిషత్తులతో వేదము చెప్పువాఁడాచార్యుఁ డని మనుస్మృతి.

శ్లో॥ ఆచినోతి హి శాస్త్రాణి, ఆచారాన్ స్థాపయత్యపి ।
స్వయ మాచరతి శ్రేష్ఠ స్తమాచార్యమ్ ప్రచక్షతే ॥

సర్వశాస్త్రములను సంకలనము చేసి, యా శాస్త్రముల యందలి యాచారములను లోకములో వ్యాపింపఁజేసి, పరోపదేశ పాండిత్యమే కాక యా యాచారములను స్వయముగా నాచరించునాఁ డాచార్యుఁ డని నిర్వచనము.

బ్రహ్మాదిదేవతలకుఁ గూడఁ బరమాచార్యుఁడు శ్రీదక్షిణామూర్తి.

శ్లో॥ చిత్రం వటతరో ర్మూలే వృద్ధాః శిష్యా గురు ర్యువా।
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః॥

ఆశ్చర్యము! మఱ్ఱిచెట్టు క్రింద నున్న యువకుఁడు గురువు. శిష్యులు వృద్ధులు. గురువు యొుక్క మౌనవమే సర్వవిద్యావ్యాఖ్యానము. శిష్యుల సందేహము లన్నియు ఛిన్నాభిన్నములగుచున్నవి.

శ్లో॥ వటవిటపిసమీపే భూమిభాగే నిషణ్ణం
సకలమునిజనానాం జ్ఞానదాతార మారాత్।
త్రిభువనగురు మీశం దక్షిణామూర్తిదేవం
జననమరణదుఃఖచ్ఛేదదక్షం నమామి॥

మఱ్ఱిచెట్టు క్రింద నున్న భూమిభాగముపైఁ గూర్చున్న వానిని, సమస్త మహర్షులకు దగ్గఱగా జ్ఞానము నొసఁగు వానిని ముల్లోకములకు గురువైన యీశ్వరుని, చావుపుట్టుకలతోఁ గూడిన సకల దుఃఖములను నాశనము చేయుటలో సమర్థుఁ డైన వానిని, శ్రీదక్షిణామూర్తిని నమస్కరించుచున్నా నని శ్రీదక్షిణామూర్తి స్తోత్రము. శివస్వరూపుఁ డైన శ్రీదక్షిణామూర్తి, విష్ణుస్వరూపుఁ డైన శ్రీహయగ్రీవస్వామి సకలవిద్యాధిదేవతలు.

మరందః – మకరందః

ఇక్కడ 'వాచా మకరంద' యను ముద్రితపాఠ మపపాఠము. గణభంగము. 'మకరందః పుష్పరసః' –అని దర్పణ వ్యాఖ్యాత కూడ నపపాఠమును గైకొనుట వింతగా నున్నది.

మరంద శబ్ద మమరకోశములో లేదు. ప్రాచీనకవులు వాడ లేదు. అందువలన గ్రంథపరిష్కర్త గణభంగమును గుర్తింపక మకరంద శబ్దమును మూలశ్లోకమునందు వ్యాఖ్యానమునందు జొనిపి యుండును. మరందశబ్ద మసాధువుగాదు.

'మకరందో మరందోఽస్య' –అని యాదవప్రకాశయతి వైజయంతీకోశము. మరందః – మరం మరణం ద్యతి భ్రమరాణాం జీవనహేతుత్వాత్. దో – కః – ముమ్ – మకరందే – అని తారానాథతర్కవాచస్పతి శబ్దస్తోమమహానిధి.

మరందః – పుం. మరం మరణం ద్యతి ఖండయతి. భ్రమరాణాం జీవనహేతుత్వాత్। దో+కః యద్వా మకరందః పృషోదరాదిత్వాత్ సాధుః మకరందః – ఇతి శబ్దరత్నావళీ। యథా –

శ్లో॥ మాకందముకులస్యందిమరందస్యందిమందిరే ।
కేలితల్పే ముకుందేన కుందబృందేన మండితా ॥ ఇతి స్తవావలీ ॥

అని రాధాకాంతదేవ – శబ్ద కల్పద్రుమము.

శ్లో॥ సాక్షాద్ద్రాక్షా మజక్షమ్ మధురస మధయమ్ ప్రాగవిందమ్ మరందమ్ । (శం. వి–4–93)
అని మాధవీయ శంకర విజయము.

పరమప్రామాణికుఁడు బహుగ్రంథకర్త యగు కృష్ణకవి తన కావ్యమునకు 'మందార మరంద చంపు' వని పేరు పెట్టినాఁడు. కాఁబట్టి – 'వాచామరందమధు' –అనునదే సాధుపాఠము. ౩.

## ౪. తంజాపురేశ్వరి – ఉపాలంభము

***అవతారిక :***

నీచులు వ్యసనపరులు నగు వారిని ధనవంతులుగాఁజేయుట, మంచి గుణములు గల పుణ్యాత్ములను బీదవారిగాఁజేయుట నీకు మంచిపని గాదని తంజాపురాధిదేవత నెత్తిపొడుచుచున్నాఁడు.

**శ్లో॥ ఖంజాయితోఽ ధిమతి–గంజాపరోఽపి బత–సంజాయతేఽ త్ర ధనదః**
**సంజాఘటీతి గుణ–పుంజాయితస్య నతు–గుంజామితం చ కనకమ్ ।**
**కిం జాగ్రతీ జయసి?–కిం జానతీ స్వపిషి?–శింజాననూపురపదే!**
**తంజాపురేశి! నవ–కంజాక్షి! సాధు తది–దం జాతువా కిము శివే! ॥** ౪

**వ్యాఖ్య:** తంజాపురేశి = తంజాపురమున కధిదేవతవైన బృహన్నాయకీ! అత్ర = ఇక్కడ; అధిమతి = బుద్ధియందు; ఖంజాయితః = కుంటివాఁడు. 'శ్రోణఃపంగౌ, ఖోడే ఖంజః' –అని యమరము. కుంటుపడిన బుద్ధి గలవాఁడు–బుద్ధి లేని మూఢుఁడని యర్థము. గంజాపరః–అపి = గంజాయి–కల్లు త్రాగు నింటి యం దాసక్తి గలవాఁడు కూడ; బత = అయ్యో! ధనదః = కుబేరుఁడుగా; సంజాయతే = పుట్టుచున్నాఁడు–అగుచున్నాడు. 'గంజా తు మదిరాగృహమ్' –అని యమరము. గుణపుంజాయితస్య = మంచి గుణములు గల వానికి; గుంజామితమ్ = గురివెందపూస యెత్తు గల; 'గుంజే తు కృష్ణలా' –అని యమరము. కనకం చ = బంగారము కూడ; న తు సంజాఘటీతి = ఘటించుటలేదు – లభించుటలేదు. శింజాన = మ్రోఁగుచున్న; నూపుర = అందెలు గల; పదే = పాదములు గలదానా! నవ = క్రొత్తగా (వికసించిన); కంజాక్షి = పద్మములవంటి కన్నులు గల దానా! శివే! = పార్వతీదేవీ! జాగ్రతీ = మెలఁకువగా నుండియే; కిం జయసి? = సర్వోత్కృష్టముగా వర్తించుచున్నావా? జానతీ = తెలిసియే; కిం స్వపిషి? = నిద్రించుచున్నావా? తత్ ఇదమ్ – తదిదమ్ = ఇయ్యది యీ విధముగాఁ జేయుట; జాతు వా = ఎప్పుడైనను; 'కదాచిజ్జాతు' –అని యమరము. సాధు కిము = మంచిదేనా?

**తాత్పర్యము :** తంజాపురేశ్వరీ! మ్రోఁగుచున్న కాలిమంజీరములు గలదానా! క్రొందమ్ముల వంటి కన్నులు గలదానా! పార్వతీ! ఇక్కడ బుద్ధి లేని మూర్ఖుఁడు; గంజాయి, కల్లు మొదలగు మత్తు పదార్థములు సేవించువాఁడు కుబేరుని వలె ధనవంతుఁ డగుచున్నాఁడు. సద్గుణములు రాశులుగాఁ గల మంచివాఁడు గురివెందపూస యంత బంగారపు ముక్క కూడ లభింపక దరిద్రుఁడగుచున్నాఁడు. నీవీ విషయము లన్నియుఁ జూచుచు మెలఁకువగా నుండియే సహించుచున్నావా? లేక తెలిసియుఁ దెలియని దాని వలె నిద్రపోవుచున్నావా? ఇట్లు చేయుట నీకు మంచిపనియేనా? యని భావము.

**విశేషములు :** జగన్నాథ పండితరాయలు కూడ భగవంతు నిట్లే యుపాలంభించినాఁడు.

శ్లో॥ భూతి ర్నీచగృహేషు విప్రసదనే దారిద్ర్యకోలాహలో
నాశో హంత! సతా మసత్పథజుషా మాయుః శతానాం శతమ్ ।
దుర్నీతిం తవ వీక్ష్య కోపదహన జ్వాలాజటాలోఽపి సన్
కిం కుర్వే? జగదీశ! యత్పున రహం దీనో భవా నీశ్వరః ॥ (భామినీ–శాంతి–25)

నీచుల యిండ్లలో నైశ్వర్యము కనఁబడుచున్నది. వేదములు చదువు బ్రాహ్మణుల యిండ్లలో బీదతనముతో నాఁకలితో హాహాకారములు వినఁబడుచున్నవి. సత్పురుషు లల్పాయుష్కులగు చున్నారు. చెడ్డ మార్గము ననుసరించు దుష్టులు వందల కొలఁది సంవత్సరములు జీవించుచున్నారు. ఇట్టి నీ చెడు వ్యవహారము చూచినప్పుడు నా కోపాగ్నిమంటలు సెగలు

పైకెగయు చున్నవి. కాని నే నేసామర్థ్యమును లేని దీనుఁడ నైతిని. నీవు సర్వసమర్థుఁడవైన భగవంతుఁడ వైతివి. జగదీశ్వరా! ఏమి చేయఁగలను?

***తంజా పురేశి :***

తంజాపురములో వెలసిన శివుఁడు బృహదీశ్వరుఁడు, అమ్మవారు బృహన్నాయిక లేక బృహన్నాయకి. తంజాపురములో వెలసిన విష్ణువు యోగనరసింహస్వామి. కనకవల్లి, కమలవల్లి, కోమలవల్లి యను పేరులతో లక్ష్మీదేవి సాక్షాత్కరించుచున్నది. ధనాధిదేవత లక్ష్మీదేవియే యైనను 'శివే!' యను సంబోధనముతో బృహన్నాయకినే కవి యుద్దేశించినాఁడు.

తంజాపురి – 'తంజావూరు' 'తంజోరు' –అని వ్యవహరింపఁబడుచున్నది. 'తుళజాపురి' యని దీని ప్రాచీననామము. ఇది తమిళ రాష్ట్రము లోని సుప్రసిద్ధ పుణ్యక్షేత్రము. బృహదీశ్వరాలయము మిక్కిలి పెద్దది. తంజావూరు నాయకరాజులు రెండు శతాబ్దములపాటు సాటి లేని సారస్వతసేవ గావించినారు. ప్రపంచమునందే యతిప్రసిద్ధమగు సరస్వతీ మహలు– తాళపత్ర పుస్తక గ్రంథాలయ మిచ్చటనే కలదు. ఇది యనేక భాషలలో ముఖ్యముగా సంస్కృతాంధ్రములలో నపురూపమైన గ్రంథముల కాణాచి. (Tanjore : Tanjavur, Tamilnadu. PIN 613 001).

శ్రీ మహీధర నళినీమోహనరావుగారు 'పండితరాయల భావతరంగముల'లో; శ్రీవాసిరెడ్డి వెంకటసుబ్బయ్య గారు భామినీవిలాసపీఠికలో నీ శ్లోకమును జగన్నాథపండితరాయల రచనగా నుదాహరించుట యొక తప్పు. నాల్గవపాదములో 'తంజాపురేశి' యను చోట 'తేజోపురేశి' (తేజః పురేశి) యని ప్రాసభంగముగల దుష్టశబ్దముతో నుదాహరించుట రెండవ తప్పు. వీరీ యశ్వధాటీ కావ్యమును జూచియుండరు.

## 5. రాజగర్హణము – పార్వతీ భజనము

***అవతారిక :***

ఇప్పుడు రాజసేవ వల్ల నుపయోగము లేదని పార్వతీ దేవినే భజింపు మని యుపదేశించు చున్నాఁడు.

**శ్లో॥ ఆటీకసేఽఙ్గ! కరి–ఘోటీపదాతిజుషి–వాటీభువి క్షితిభుజాం**
**చేటీభవం స్తదపి–శాటీ న తే వపుషి–వీటీ న వాఽధి వదనమ్ ।**
**కోటీరరత్నపరి–పాటీ భృశాఽరుణిత–జూటీవిధుం తనులసత్**
**పాటీరలిప్తి మిభ–ధాటీజుషం సురవ–ధూటీనుతామ్ భజ! శివామ్ ॥** ౫

వ్యాఖ్య : అంగ = ఓరీ! 'అథ సంభోధనార్థకాః స్యుః ప్యా ట్పా డంగ హే హై భోః॥' అని

యమరము. చేటీభవన్ = నీవు దాసుఁడవై; 'భృత్యే దాసేర దాసేయ దాస గోప్యక చేటకాః' –అని యమరము. కరి = ఏనుఁగులచే; ఘోటీ = గుఱ్ఱములచే; పదాతి = భటులచే; జుషి = సేవింపఁబడిన; క్షితిభుజామ్ = రాజులయొక్క; వాటీ భువి = ఉద్యానవన భూములలో; ఆటీకసే = తిరుగుచున్నావు. తత్ + అపి – తదపి = అది కూడ – దాని వలనఁగూడ; తే = నీయొక్క; వపుషి = దేహముపై (కప్పుకొనుటకు); శాటీ న = శాటి (గుడ్డ) కూడ లభించుట లేదు. అధివదనమ్ = నోటియందు; వీటీ న = తాంబూలము కూడ లభించుటలేదు. కోటీర = కిరీటమునందలి; రత్న = నవరత్నములయొక్క; పరిపాటీ = పంక్తిచే; భృశ = మిక్కిలి; అరుణిత = ఎఱ్ఱనైన; జూటీ విధుమ్ = జటాజూటమునందలి చంద్రవంక కల దానిని; తను = ఒంటి యందు; లసత్ = ప్రకాశించు చున్న; పాటీరలిప్తిమ్ = మంచి గంధపుఁబూఁత గల దానిని; ఇభ ధాటీజుషమ్ = ఏనుఁగు నడక వంటి నడక కల దానిని – గజగామిని నని యర్థము. సురవధూటీ = దేవతాస్త్రీలచే; నుతామ్ = స్తుతింపఁబడినదానిని; శివామ్ = పార్వతీదేవిని, 'శివా భవానీ రుద్రాణీ శర్వాణీ సర్వమంగళా' –అని యమరము. భజ = సేవింపుము.

**తాత్పర్యము :** ఓరీ మూర్ఖుఁడా! నీవు సేవకుఁడవై చతురంగ సైన్యముగల రాజుల పూలతోఁటలలో మాటిమాటికి వారి చుట్టు పరిభ్రమించుచున్నావు. ఇదంతయు వ్యర్థము. వారు నీకు భుజముపై వేసికొనుటకు దుప్పటి గుడ్డను గూడ నీయరు. వారి వలన నీకుఁ గనీసము నోటిలో వేసికొనుటకు వీడెము కూడ దొరకదు. అందు వలన నీవు కిరీటము నందలి రత్నమాణిక్యముల వరుసచే నెఱ్ఱనైన కొప్పుపైఁ జంద్రవంకను ధరించినది, దేహముపైఁ బ్రకాశించు చందన లేపనము గలది, నిత్యము దేవకాంతలచే స్తోత్రము చేయఁబడినది యగు పార్వతీదేవినే భజింపుము. నీ కష్టములు గట్టెక్కు నని భావము.

***విశేషములు :***

ఐహిక సుఖవిముఖులు, భగవద్భక్తప్రముఖులు నగు పెక్కు మంది మహాకవు లిట్లే రాజసేవనమును గర్హించి యున్నారు. కొన్ని యుదాహరణములు –

***వేదాంతదేశికులు :***

శ్లో॥ కాచాయ నీచం కమనీయవాచా – మోచాఫలస్వాదుముచా న యాచే ।
దయాకుచేలే ధనదత్కుచేలే – స్థితేఽకుచేలే శ్రితమాకుచేలే ॥

అరఁటిపండు వలెఁ దియ్యగా నున్న యందమైన వాక్కుతో గాజు పెంకులకై నీచులను యాచింపను. దయాసముద్రుఁడు, (కు–చేలము = భూమికి బట్ట సముద్రము); కుబేరునిగాఁ

జేసిన కుచేలుఁడు గలవాఁడు; చెడ్డ బట్ట కాని బంగారుపుట్టమును ధరించినవాఁడు (అ–కు–చేలుఁడు); ఆశ్రయించిన లక్ష్మీదేవి స్తనభూమి (ప్రదేశము) గలవాఁడు (శ్రిత–మా–కుచ–ఇలే) నగు శ్రీమహావిష్ణు వుండఁగా వారి నేల యాచింపవలయును?

**మాధవాచార్యులు :**

శ్లో॥ వంధ్యాసూనుఖరీవిషాణసదృశక్షుద్రక్షితీంద్రక్షమా
శౌర్యౌదార్యదయాదివర్ణనకలాదుర్వాసనావాసితామ్ ।
మద్వాణీ మధివాసయామి యమిన స్త్రైలోక్యరంగస్థలీ
నృత్యత్కీర్తినటీపటీరపటలీచూర్ణైర్వికీర్ణైఃక్షితౌ॥

గొడ్రాలిబిడ్డతో, గాడిద కొమ్ములతో సమానులు క్షుద్రులు నైన రాజుల యొక్క యోర్పు, పరాక్రమము, ఔదార్యము, కరుణ మొదలగు గుణములను వర్ణించుట యను కళ యొక్క దుర్గంధముచేఁ గంపు కొట్టు నా వాక్కును శ్రీశంకరభగవత్పాదాచార్యుల కీర్తిగంధముచేఁ బరిమళింపఁ జేయుదును. ఆ కీర్తి యను నర్తకి ముల్లోకము లను రంగస్థలముపై నర్తనము చేయునప్పు డామె యొంటిపైఁ బూసికొన్న మంచి గందపుఁ బొడి యొక్క సువాసనలు భూమి యందు వ్యాపించును.

***వేంకటాధ్వరి :***

శ్లో॥ గర్వద్దుర్వసుధాపతిస్తుతిపరవ్యామోహకూపాంధతా
నిర్విణ్ణాశయ ఏష వేంకటకవిః పంకేరుహావాసిని! ।
అద్య త్వద్గుణవర్ణనామృతరసై రానందితుం జృంభతే
చించాపర్ణరసావసన్నరసనః పుండ్రేక్షుసారై రివ ॥

గర్వించుచున్న దుష్టులగు రాజులను స్తుతించుట యను వ్యామోహముతో నూతిలోఁ బడిన గ్రుడ్డివాని వలె నిర్వేదము నొందిన యాశయము గల యీ వేంకటాధ్వరి – ఓ లక్ష్మీదేవీ! చింతాకులు నములుటచేఁ బులిసిన నాలుక గలవాఁడు తియ్యని చెఱుకురసమును గ్రోలినట్లుగా నీ గుణముల వర్ణన మను నమృతరసముచే నానందించుటకు విజృంభించు చున్నాఁడు.

***పోతన :***

ఉ॥ ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

*హరిభట్టు :*

చ॥ ఎడపక విష్ణునిం బొగడ నెన్నఁడు నొల్లక దుర్మదంబునన్
గడుపులకై నరాధములఁ గావ్యముఖంబుల సన్నుతింపఁగాఁ
బొడమిన పాపజాలముల బొట్టణఁగం బొలియించు ముక్తిఁ బొం
దెడు కొఱకై రచింతుఁ గృతి నీలగిరీంద్రున కర్పితంబుగన్.

*ధూర్జటి :*

శా॥ రాజుల్ మత్తులు వారి సేవ నరకప్రాయంబు వా రిచ్చు నం
భోజాక్షీచతురంతయానతురగీభూషాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలుఁ బరితృప్తిం బొందితిన్ జ్ఞానల
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము! దయతో శ్రీకాళహస్తీశ్వరా!

ఇట్టి పద్యములు పెక్కులు గలవు.

***చేటీభవన్ - వ్యాకరణప్రక్రియ :***

చేట + భవన్ - 'భవన్' అనునది భూధాతువు యొక్క రూపము. 'లటః శతృశానచావప్రథమా-సమానాధికరణే' (3-2-124) అను సూత్రము ననుసరించి భూధాతువునకు లట్టులో శతృప్రత్యయము చేరి 'భవన్' అని యగును. భవన్ = అగుచున్నవాఁడు -అని యర్థము. కృభ్వస్తి యోగే సంపద్యకర్తరి చ్విః (5-4-50) అను సూత్రముచే - చేట శబ్దమునకు భూధాతురూప మగు 'భవన్' పరమైనపుడు చ్వి ప్రత్యయము వచ్చి 'చేట + (చ్వి) + భవన్' అని యగును. అస్య చ్వౌ (7-4-32) అను సూత్రముచే 'చ్వి' ప్రత్యయము పరమైనపుడు చేట శబ్దము చివర నున్న అకారమునకు - ఈత్త్వము వచ్చును. చ్విప్రత్యయము పూర్తిగా లోపించి 'చేట్+ఈ+భవన్' 'చేటీభవన్'-అని యగును. 'అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్' అను వార్తికముచే నంతకు ముందు కానిది యీ భావమును బొందినప్పుడు చ్వి ప్రత్యయము వచ్చును.

అచేటః చేటః సంపద్యతే - చేటీభవన్. అంతకు ముందు చేటుఁడు కాని వాఁ డిప్పుడు చేటుఁ డగుచున్నాఁ డని యర్థము. ఈ శ్లోకము కాళిదాసు రచించిన 'దేవీప్రణవస్తుతి' యందలి

శ్లో॥ చేటీభవన్నిఖిల-ఖేటీ కదంబవన-వాటీషు నాకిపటలీ
కోటీరచారుతర-కోటీమణీకిరణ-కోటీకరంబితపదా ।
పాటీరగంధికుచ-శాటీ కవిత్వపరి-పాటీ మగాధిపసుతా
ఘోటీకులా దధిక-ధాటీ ముదారముఖ-వీటీరసేన తనుతామ్ ॥
అను శ్లోకమున కనుకరణము. ౫.

## ౬. నరసేవాగర్హణము - దేవీభజనము

*అవతారిక :*

పొట్టకూటికై కుటిలులగు ధనికుల యొద్దకేఁగి దెబ్బలు తినుట కేల ప్రయత్నించుచున్నావు? అఖండానందదాయిని యగు శ్రీపార్వతీదేవినే యుపాసింపు మని బోధించుచున్నాఁడు.

**శ్లో॥ పండావదగ్రిమ! పి-చండాऽవపూర్తి మను-రండావిధేయకుటిలో**
**ద్దండాऽవివేక ధని-చండాలగేహభువి-దండాऽऽహతిం కిమయసే?**
**ఖండాऽమృతద్యుతిశి-ఖండా ముపాస్స్వ! సుర-ఖండార్చితాऽంఘ్రికమలామ్**
**భండాసురద్రుహ మ-చండాత్మికాం చితి మ-ఖండాం జడాత్మసుఖదామ్॥** ౬

**వ్యాఖ్య :**పండావత్ + అగ్రిమ = బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడా! పండితుఁడా! పండ = బుద్ధి. 'జ్ఞప్తిః పండోపలబ్ధిస్తు' 'అగ్ర్యం. త్వగ్రిమ మగ్రస్థమ్' అని యుభయత్ర వైజయంతీకోశము. పిచండ = కడుపును; 'పిచండ కుక్షీ జఠరోదరం తుందమ్' – అని యమరకోశము. అవపూర్తిమ్ = నింపుటను; అను = లక్ష్యముగాఁ గల వాఁడవై;రండా = కులటలకు; విధేయ = విధేయు లగు వారు.'రండా స్యాద్విధవా పిచ' – అని వైజయంతీకోశము. వితంతువులను భోగించుచు వారి యాజ్ఞలకు బద్ధులగు వా రనిభావము. కుటిల = వక్రమార్గము ననుసరించు వారు; ఉద్దండ = మిక్కిలి; అవివేక = వివేకము లేని వారు నగు; ధని = ధనవంతులగు; చండాల = చండాలుర యొక్క; గేహభువి = ఇండ్ల ముందరః దండ + ఆహతిమ్ = కఱ్ఱదెబ్బలు తినుటకు; కిమ్ అయసే = ఏల వెళ్ళుచున్నావు? జడ! = ఓరి మూర్ఖుఁడా! ఖండ + అమృతద్యుతి = అర్ధచంద్రరేఖ; శిఖండామ్ = శిరోభూషణముగాఁ గలదానిని;

చూడా కేశీ కేశపాశీ శిఖండీ కముజా శిఖా ।
బాలానాం సా కాకపక్షః శిఖండశ్చ శిఖండకః ॥ అని వైజయంతి.

ఇక్కడ శిఖండ శబ్దమునకు లక్షణచే శిఖాలంకార మని యర్థము. సుర = దేవతల యొక్క; ఖండ = సమూహముచే; అర్చిత = పూజింపఁ బడిన; అంఘ్రికమలామ్ = పాదపద్మములు గల దానిని; భండ + అసుర + ద్రుహమ్ – భండాసురద్రుహమ్ = భండుఁ డను రాక్షసుని జంపిన దానిని; అచండాత్మికామ్ = కోపము లేని దానిని; అమ్మవారు క్రూరరాక్షసుల యెడఁ జండిక యైనను భక్తుల యందుఁ గోపము లేని దని భావము. అఖండాం చితిమ్ = అఖండ చిద్రూపిణిని – ఎడతెగని జ్ఞానమే స్వరూపముగాఁ గలదానిని, ఆత్మసుఖదామ్ = ఆత్మానందము నిచ్చు దానిని, జగదంబ యగు పార్వతీదేవిని; ఉపాస్స్వ = ఉపాసింపుము.

**తాత్పర్యము :** ఓ పండితశ్రేష్ఠుఁడా! నీవు పొట్టకూటికై రండా విధేయులు, కుటిలులు,

ఉద్ధతులు, వివేకశూన్యులు నగు ధనికు లను చండాలుర గృహముల ముంగిళ్ళ యందుఁ బడిగాపులు కాచి వారిచే దండప్రహారములను బొందనేల? చంద్రరేఖను ధరించినది, దేవతాగణముచే నర్చింపఁబడిన పాదపద్మములు గలది, భండాసురుని జంపినది, భక్తుల యెడలఁ గోపము లేనిది, యఖండచిద్రూపయైనది, యాత్మానందము నిచ్చునది యగు శ్రీపార్వతీదేవిని సేవింపు మని భావము. పండ యనఁగా బుద్ధి. పండావంతుఁడు పండితుఁడు. 'గతాసూ నగతాసూం శ్చ నాను శోచంతి పండితాః' (భ.గీ.2-11) అను శ్లోకము దగ్గర - "పండితా ఆత్మజ్ఞాః। పండా ఆత్మవిషయా బుద్ధి ర్యేషాం తే హి పండితాః 'పాండిత్యం నిర్విద్య' (బృహ-3-5-1) ఇతి శ్రుతేః ॥" అని శ్రీశంకరభాష్యము.

లౌకికముగా వేదశాస్త్రపురాణేతిహాసాదులను జదివిన వాఁడు పండితుఁడు. ఆధ్యాత్మికముగా నాత్మజ్ఞానులు పండితులు. 'పండావదగ్రిమ! జడ!' యను రెండు సంబుద్ధులచే నీవు శాస్త్రములు చదివి వివేకము నొందిన యాత్మజ్ఞాని వయ్యు నుదరపోషణమునకై ధనికులను యాచించుచు జడుఁడ వేల యగు చున్నావని భావము. గర్వించిన ధనవంతు లింటికి వచ్చిన వారిని పొండని కఱ్ఱతో నదలించుట లోకస్వభావము.

జగదంబ యగు దుర్గాదేవి భండాసురుని వధించిన కథ మార్కండేయ పురాణ - దేవీ భాగవతాదులలోఁ బ్రసిద్ధము. ౬.

## ౭. ధనగర్హణము - శివభజనము

***అవతారిక :***

నీవు ధనమును సంపాదించుటకై పట్టణముల వెంబడి తిరుగుచు నెండల కెండి వానలకుఁ దడిసి యేల యవయుచున్నావు? శివుని భజింపు మని యుపదేశించుచున్నాఁడు.

**శ్లో॥ గాఢా త్వయా సపది-రాఢాపురీ వసుని-బాఢావబద్ధరతినా**
**సోఢా తథా తపన-గాఢాఽఽతపప్రసర-రూఢాతివృష్టివితతిః ।**
**మూఢాఽపి కిమ్ ఫల మ-గూఢా జరైవ శిర-సోఢా కుతో న వినుతో**
**ద్రోఢా జనే ర్జనిత-షోఢాముఖః సమితి-వోఢా స హాటకగిరేః ॥** ౭

***వ్యాఖ్య :*** మూఢ = ఓరి మూర్ఖుఁడా! వసుని = ధనమునందు; బాఢ = ఎక్కువగా; అవబద్ధ = నిలుపఁబడిన; రతినా = ప్రేమ గల వానిచే; త్వయా = నీచే; రాఢా పురీ = రాఢా పట్టణము; గాఢా = ప్రవేశింపఁ బడినది. ధనము నందలి వ్యామోహముచే నీవు రాఢా పట్టణములోఁ బ్రవేశించితి వని భావము. తథా = అట్లు; తపన = సూర్యుని యొక్క; గాఢ = మిక్కుటమైన; ఆతప = ఎండ యొక్క; ప్రసర = ప్రసారముచే; రూఢ = ఎక్కువ యైన; అతివృష్టి = తెఱపి

లేని పెద్ద పెద్ద వానల యొక్క; వితతిః = సమూహము; సోఢా = సహింపఁబడవలయును. 'షమూ–హర్షణే' –అని ధాతువు. పట్టణములలో నెండ లెక్కువగాఁ గాయుటచే వానలు కూడా నెక్కువగాఁ గురియును. ఆ యెండలను వానలను నీవు సహింప వలె నని భావము. అపి కిం ఫలమ్? = ఇట్టి బాధలు సహించి కూడ నేమి ఫలితము నొందెదవు? అగూఢా = వ్యక్తముగా నున్న; జరా = ముసలితనము; శిరసా = తలచే; ఊఢా = ధరింపఁబడినది. నీవు ముసలివాఁడ వగుచున్నా వని భావము. జనేః = పుట్టుకకు; 'జని రుత్పత్తి రుద్భవః' –అని యమరము. ద్రోఢా = ద్రోహము చేయు వానిని; ఇది శివునకు విశేషణము. 'జని' యనునది మరణాదుల కుపలక్షకము. పుట్టుక, చావు మొదలగు సంసారబాధలు లేకుండఁ జేయువాఁడు శివుఁడని భావము. జనిత = పుట్టింపఁబడిన; షోఢాముఖః = ఆఱు ముఖములు గల కుమారస్వామి గలవాఁడు. షణ్ముఖునకు జనకుఁ డని భావము. సమితి = యుద్ధములో; 'సమిత్యాజి సమిద్యుధః' –అని యమరము. హాటకగిరేః = బంగారు పర్వతము యొక్క; వోఢా = వాహకుఁడు. త్రిపురాసుర సంగ్రామములో మేరుపర్వతమును విల్లుగా వహించిన వాఁ డని భావము. సః = ఆ ప్రసిద్ధుఁ డగు శివుఁడు; కుతః = ఎందువలన; న వినుతః = నీచే స్తుతింపఁబడఁడు? అట్టి శివుని నీ వెందువలన నుతించుటలేదని భావము.

**తాత్పర్యము :** ధనము సంపాదించుట యం దెక్కువ ప్రీతి గలవాఁడవై నీవు రాఢాపురము వెళ్ళితివి. ఆ పట్టణములో మండుటెండల కెండి ముసురువానలలోఁ దడిసితివి. ఈ విధముగాఁ గష్టము లనుభవించుట వలన నీకేమి ఫలము దక్కినది? నీవు మిక్కిలి మూర్ఖుఁడవు. ఈ పట్టణప్రయాణములతో బడలి ముసలివాఁడ వైతివి. ఈ జంజాటమును మాని పరమశివుని నీవేల స్తుతింపవు? అతఁడు జననమరణరూపము లగు సంసారబాధలను రూపుమాపు వాఁడు. షణ్ముఖములు గల కుమారస్వామినిఁ గన్న తండ్రి. యుద్ధములో మేరుపర్వతమును విల్లుగా ధరించినవాఁడు. అట్టి శివుని నీవు కొలిచినచో నీ కష్టము లన్నియుఁ దీరు నని భావము.

**విశేషములు :**

ఇక్కడ 'ద్రోఢా జనోః' అను ముద్రితపాఠ మపపాఠము. 'జను ర్జనన జన్మాని' –అని యమర వైజయంతీకోశములలో నుండుటచే సకారంత మగు జనుశ్శబ్దము నుకారాంతముగా వాడుటకు మూలము మృగ్యము. ఇది వ్రాయసగాండ్ర లేక పరిష్కర్తల పొరపాటు. 'జని రుత్పత్తి రుద్భవః' –అను కోశముచే 'ద్రోఢా జనేః' –అనునదే కవిపాఠము.

**రాఢా పురి :**

ఇది పశ్చిమబెంగాలు నందలి పట్టణము. ప్రాచీనకాలము లో దీనికి 'సుహ్మ'దేశ మని వ్యవహారము. శ్రీకృష్ణమిశ్రుల ప్రబోధచంద్రోదయములో రాఢా ప్రశంస గలదు.

రాఢా – స్త్రీ – సుహ్మః శోభా ఇతి మేదినీ। పుర విశేషః। యథా–

శ్లో॥ గౌడం రాష్ట్ర మనుత్తమం నిరుపమా తత్రాపి రాఢాపురీ
భూరిశ్రేష్ఠకనామధామ పరమం తత్రోత్తమో నః పితా ।
తత్పుత్త్రాశ్చ మహాకులా న విదితాః కస్యాత్ర తేషా మపి
ప్రజ్ఞాశీలవివేకధైర్యవినయాచారై రహం చోత్తమః ॥ (ప్రభోధ–2–7)

ఇతి ప్రబోధచంద్రోదయే దంభవాక్యాత్ ॥ అని శబ్దకల్పద్రుమము.

ఇది యహంకారవాక్యము కాని దంభవాక్యము కాదు.

రాఢా. Radha. F. beauty. splendour, L. (Some times wirtten rara. Name of a district in the West of Bengal. C = Suhma)

(A Sanskrit - English Dictionary : Sir M.M.Williams.)

**మేరు ధనువు :**

శివుఁడు త్రిపురాసురులతో యుద్ధము చేసి నపుడు భూమి రథమైనది. సూర్యచంద్రులు చక్రము లయినారు. వేదములు గుఱ్ఱములైనవి. బ్రహ్మ సారథి యైనాఁడు. మేరుపర్వతము విల్లైనది. వాసుకి వింటినారి యైనాఁడు. శ్రీమహా విష్ణువు బాణ మైనాఁడు. ఈ కథ పురాణ ప్రసిద్ధము.

శ్లో॥ మౌర్వీ మూర్ధ్ని రథః శరాసన శిరఃసంచారి చక్రద్వయం
చక్రాంత ర్నిహితః శర స్తదుదరే సూత స్తదాస్యే హయాః ।
తేషా మేవ శిరః పదేషు వసతిః స్వస్యేతి యస్య శ్రుతం
దేవ శ్చిత్రపరిచ్ఛదః స భగవాన్ కుర్యాత్ సదా మంగళమ్ ॥ అను శ్లోకము ప్రసిద్ధమైనదే.

శివుని వింటికి వాసుకి నారి యైనాఁడు. ఆ వింటినారి (వాసుకి) తలపై రథము (భూమి) గలదు. సర్పము భూమిని మోయుచున్నది గదా! మేరుపర్వతము విల్లైనది. మేరు పర్వత శిరస్సునకుఁ బ్రదక్షిణము చేయువారు సూర్యచంద్రులు. వారు రథచక్రము లైరి. చక్రము లోపల నున్నవాఁడు శరమైనాఁడు. సూర్యుఁడు చక్రము. సూర్యునిలో నున్నవాఁడు శ్రీమహావిష్ణువు. 'ధ్యేయః సదా సవితృమండల మధ్యవర్తీ' –అని ధ్యానశ్లోకము. ఆ విష్ణువే శివునకు బాణమయినాఁడు. ఆ విష్ణువు నుదరమం దున్నవాఁడు సూతుఁ డైనాఁడు. విష్ణువు నాభీపద్మము నందున్న బ్రహ్మ సారథి యైనాఁడు. ఆ సారథి ముఖములో గుఱ్ఱము లున్నవి. బ్రహ్మ నాలుగు ముఖము లందు నాలుగు వేదములు నున్నవి గదా! ఆ హయముల (వేదముల) శిరః స్థానముల (ఉపనిషత్తుల) యం దెవనికి నివాసమో యట్టి వ్యాఘ్ర చర్మాంబరధారి యైన భగవంతుఁడగు శివుఁడు మా కెల్లప్పుడు మంగళము చేకూర్చుఁగాక! యని యీ శ్లోకమునకు భావము.

చ॥ అదలని తేరు; తేరి పయి నాదరువై తగు విల్లు; వింటికిం
గుదురగు నారి; నారికిని గూర్కు శరంబు; శరంబు బొడ్డునన్
బొదలు నియంత; యంత ముఖముల్ నిజవాసము లైన గుఱ్ఱముల్
చెదరక నీకు నెట్టి పని చేయునయా? గిరిజాధినాయకా!

అని రంగనాథుని చాటుధార.

కదలని రథము – భూమి (అచల). తేరిపై నాధారముగా నున్నది విల్లు – మేరువు. భూధరములు భూమికిఁ బైనున్నను భూమిని ధరించునవే కదా! ఆ వింటికిఁ జుట్టకుదురువలెఁ జుట్ట చుట్టుకొని యుండు వాసుకి (పాము) నారి. ఆ నారిలో (సర్పములో) నిద్రించు వాఁడు (విష్ణువు) బాణము. ఆ బాణము (విష్ణువు) యొక్క బొడ్డు నుండి పుట్టిన వాఁడు (బ్రహ్మ) సారథి. సారథి (బ్రహ్మ) ముఖములలో నివాస మున్నవి (వేదములు) గుఱ్ఱములు. యుద్ధములో నీ సాధనములు చెదిరిపోకుండ నీకెట్లు పనిచేసిన వయ్యా! శివా! చెప్పుము. అని యీ పద్యమునకు భావము. పద్య మంతట ముక్త పదగ్రస్తము.

త్రిపురాసుర సంహారగాథకు సంబంధించిన శివస్తుతులలో నిట్టి చమత్కారపద్యము లనేకములు గలవు. ౭.

## ౮. లౌకికవస్తుగర్హణము – శివసేవనము

***అవతారిక :*** ఏనుఁగులు, గుఱ్ఱములు, మొదలగు లౌకికసంపద లన్నియు శాశ్వతములు కావు. కావున సంసారతారకుఁ డైన పరమశివునే సేవింపు మని యుపదేశించుచున్నాఁడు–

**శ్లో॥ దంతావలాఽశ్వభృతి–చింతాపరోఽసి బత–కిం తావతా? వద ఫలం**
**హంతాఽఖిలం క్వచన–గంతా తదేత దథ–సంతాప మంచసి పరమ్ ।**
**త్వం తాత! భావయ! దు–రంతా రమాఽ నవర–తం తామసః స్వపిహి మా**
**సంతారకం వినత–సంతానకం సపది–తం తావ దాశ్రయ! శివమ్ ॥** ౮

***వ్యాఖ్య :*** తాత = తండ్రీ! ముసలివా రగు తాతలు చిన్నవా రగు తమ మనుమలను బాబూ! నాన్నా! తాతా! యని ముద్దుపేళ్ళతోఁ బిలుచుట లోకస్వభావము. త్వం = నీవు; దంతావల = ఏనుఁగులు; అశ్వ = గుఱ్ఱములు మొదలగు వానిని; భృతి = భరించుటలో; చింతాపరః + అసి = ఆలోచనాతత్పరుఁడవై యున్నావు. బత = ఓయీ! అని సంభోధనము. 'ఖేదానుకంపాసంతోషవిస్మయామంత్రణే బత' అని యమరము. తావతా = దానివలన; కిం ఫలమ్ = ఏమిఫలితము కలదో; వద = చెప్పుము. హంత! = అయ్యో!. 'హంతహర్షాఽ

నుకంపాయాం వాక్యారంభ విషాదయోః' – అని యమరము. తత్ + ఏతత్ + అఖిలమ్ తదేతదఖిలమ్ = ఈ సంపద యంతయు; క్వచన = ఎక్కడికో; గంతా = పోయెడిదే. అథ = అది పోయిన తరువాత; పరంసంతాపమ్ = మిక్కిలి దుఃఖమును; అంచసి = పొందుచున్నావు. రమా = లక్ష్మి (సంపద); దురంతా = దుష్పరిణామము గలది యని; భావయ = భావింపుము. అనవరతమ్ = ఎల్లప్పుడు; తామసః = తామసుండవై – తమోగుణ ప్రధానుండవై; మా స్వపిహి = నిద్రింపకుము. అజ్ఞానాంధుండవు కావలదనిభవము. మఱేమి చేయ వలయునో చెప్పుచున్నాండు – సంతారకమ్ = ఈ సంసారసముద్రము నుండి తరింపంజేయు వానిని; వినత = వంగి నమస్కరించిన భక్తులకు; సంతానకమ్ = కల్పవృక్ష మైన వానిని;

శ్లో॥ పంచైతే దేవతరవో మందారః పారిజాతకః।
సంతానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచందనమ్॥ అని యమరము.

సపది = వెంటనే

'స్రాగ్ఝడిత్యంజసాహ్నాయ ద్రాఙ్మంక్షు సపది ద్రుతే' – అని యమరము. తం శివమ్ = ఆ శివునే; తావత్ = సంపూర్ణముగా; ఆశ్రయ = ఆశ్రయింపుము.

యావత్తావచ్చ సాకల్యేఽ వధౌ మానేఽ వధారణే – అని యమరము.

**తాత్పర్యము :** ఓ యబ్బాయీ! నీ వెల్లప్పుడు నేనుంగులు, గుఱ్ఱములు మొదలగు సంపదలను సంపాదించుటకై ప్రాంకులాడు చున్నావు. నీ చింత వాని పైనే యున్నది. అది మంచి పని కాదు. ఆ సంపదల వలన నేమి ఫలము గలదో చెప్పుము. అయ్యో! యీ సంపద లన్నియు నెప్పుడో యొకప్పు డెక్కడకో పోవునవే. అవి నశించిన పిమ్మట మఱల నిష్టవస్తు వియోగముచే సంతాపమునే పొందుచున్నావు. ఈ లక్ష్మి చంచలయైనది. చివరకు దుఃఖమునే మిగుల్చున దని నిశ్చయింపుము. తామసుండవై వివేకము విడిచి పెట్టి నిద్రింపకుము. సమస్తజీవులను దరింపంజేయువాండు, తన్ను నమస్కరించు భక్తులకుం గల్పవృక్షమై యెల్ల కోరికలను దీర్చువాండు నగు శ్రీపరమశివునే యాశ్రయింపుము. నీకు సమస్తకల్యాణములు కల్గు నని భావము.

శ్లో॥ అర్థానా మార్జనే దుఃఖ మార్జితానాం చ రక్షణే।
ఆయే దుఃఖం వ్యయే దుఃఖం ధిగ్ధనం దుఃఖభాజనమ్॥

సంపదల నార్జించుటలో దుఃఖము గలదు. సంపాదించిన వానిని రక్షించుటలో దుఃఖము గలదు. అవి లాభించినను దుఃఖమే. నశించినను దుఃఖమే. ఇట్లు దుఃఖములకుం బాత్ర మైన యర్థము వ్యర్థము గదా! యని ప్రాచీనసుభాషితము.

***తామసలక్షణము :***

(1) సత్త్వము (2) రజము (3) తమము - అని గుణములు మూఁడు విధములు.

శ్లో॥ సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్॥
తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్।
సుఖసంఘేన బధ్నాతి జ్ఞానసంఘేన చానఘ॥

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి! తృష్ణాసంగసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన దేహినమ్॥
తమస్త్వజ్ఞానజం విద్ధి! మోహనం సర్వదేహినామ్।
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత॥ (భ. గీ - 14 - 5 - 8శ్లో.)

(1) అర్జునా! సత్త్వము, రజస్సు తమస్సు నను మూఁడు గుణములు ప్రకృతి నుండి పుట్టుచున్నవై నాశరహితుఁడైన యాత్మను దేహములో బంధించుచున్నవి. (2) వానిలో సత్త్వ గుణము నిర్మల మైన దగుట వలన వికారరహితమై ప్రకాశమును జ్ఞానము నిచ్చును. సుఖముతోఁ గూడిన దగుట వలన, జ్ఞానాభిమానము వలన జీవుని బంధించును. (3) రజోగుణము రాగాత్మక మైన దని తెలిసికొనుము. ఇది కోరికల కూడికచేఁ బుట్టును. ఇది జీవునిఁ గర్మసంగముతో బంధించుచున్నది. (4) తమోగుణ మజ్ఞానము నుండి పుట్టిన దని తెలియుము. ఇది సర్వజీవులను మోహింపఁజేయునది. ఇది ప్రమాదము, ఆలస్యము, నిద్ర మొదలగు వానిచే జీవుని బంధించును. అని భగవద్గీత.

తమోగుణ మెక్కువగాఁ గల వాఁడు తామసుఁడు. అందువల్లనే యీ శ్లోకములో సంపద లస్థిరము లని, తామసుఁడవై నిద్రింప వలదని జ్ఞానముతో శివు నాశ్రయింపు మని కవి యుద్బోధించినాఁడు. ౮

## ౯. శ్రీకృష్ణభజనము

***అవతారిక :***

లేక శ్రీకృష్ణుని భజింపు మని యుపదేశించుచున్నాఁడు-

**శ్లో॥ వందారులోకతతి-మందారపాదప మ-మందాయమానకరుణమ్**
**బృందావనోథపశు-బృందాఽవనమ్ ప్రణత-బృందారకం చరణయోః ।**
**నందాదృతం కుశల-సందాయి తత్కిమపి-కందాయితం శ్రుతిగిరాం**
**కుందాభకీర్తి ముచుకుందార్చితం హృది ము-కుందాహ్వయం స్మర మహః ॥ ౯**

**వ్యాఖ్య :** వందారు = నమస్కరించు శీలము గల; 'వందారు రభివాదకే'- అని యమరము. లోక = జనుల యొక్క; 'లోకస్తు భువనే జనే' - అని యమరము. తతి = సమూహమునకు; మందారపాదపమ్ = కల్పవృక్ష మైన దానిని; అమందాయమాన = తక్కువ కాని; కరుణమ్ = దయ గల దానిని; బృందావన = బృందావనము నందు; ఊఢ = వృద్ధి చెందిన; పశు = ఆవులు మొదలుగు వాని; బృంద = సమూహమును; అవనమ్ = రక్షించుదానిని; చరణయోః = అడుగుల యందు; ప్రణత = వంగి నమస్కరించిన; బృందారకమ్ = దేవతలు గల దానిని; నంద = నందునిచే; ఆదృతమ్ = ఆదరింపఁబడిన దానిని; కుశల = క్షేమమును; 'భావుకమ్ భవికమ్ భవ్యం కుశలం క్షేమ మస్త్రియామ్'- అని యమరము. సందాయి = ఇచ్చు దానిని; శ్రుతిగిరామ్ = వేద వాక్కులకు; కందాయితమ్ = మూలదుంప యైన దానిని; కుంద + ఆభ + కీర్తి = మల్లెపూవుల కాంతి వంటి తెల్లని కీర్తి గల దానిని; ముచుకుంద + అర్చితమ్ = ముచుకుందునిచేఁ బూజింపఁబడిన దానిని; ముకుంద + ఆహ్వాయమ్ = ముకుందనామము గల దానిని; తత్ + కిమ్ + అపి = ఏదో యొకానొక యనిర్వచనీయ మైన; మహః = కాంతిని; హృది = హృదయములో; స్మర = స్మరింపుము.

**తాత్పర్యము :** నమస్కరించు భక్తజనసమూహమునకుఁ గల్పవృక్ష మైన వానిని, ఎక్కువ దయ గల వానిని, బృందావనము నందలి గోవులను రక్షించు వానిని, తన పాదములకు నమస్కరించుచున్న దేవతలు గల వానిని, నందునిచే సత్కరింపఁబడిన వానిని, సమస్త శుభముల నిచ్చు వానిని, వేదవచనములకు మూలకారణమైన వానిని, మల్లెల వంటి తెల్లని కీర్తి గల వానిని, ముచుకుందునిచే సేవింపఁబడిన వానిని, ముకుందుఁడను పేరు గల గొప్ప తేజస్స్వరూపుని శ్రీకృష్ణుని హృదయములో స్మరింపుము.

***విశేషములు :***

ముకుందః - మోక్షము నిచ్చు వాఁడు ముకుందుఁడు

జీవో వినయితా సాక్షీ ముకుందోఽ మితవిక్రమః -అని విష్ణుసహస్రనామము.

'ముకుందః' -అనునది విష్ణు సహస్రనామములలో 515వ నామము.

ముక్తిం దదాతీతి ముకుందః। పృషోదరాదిత్వాత్ సాధుత్వమ్। అక్షర
సామ్యా న్నిరుక్తివచనా న్నైరుక్తానామ్ ముకుంద ఇతి నిరుక్తిః ॥

ముక్తి నిచ్చు వాఁడు ముకుందుఁడు. పృషోదరాదిగణము వలన సాధువు. ముక్తిదశబ్దస్థానములో ముకుంద శబ్దము వచ్చినది. అక్షర సామ్యము వలన నిరుక్తివచనము వలన నిరుక్తకారులు ముకుందశబ్దమునకు ముక్తిదుఁ డని నిర్వచనము చెప్పిరి. -అని శ్రీశంకరభగవత్పాద భాష్యము.

ఈ శ్లోకము కాళిదాసు రచించిన దేవీస్తుతి లోని -

శ్లో॥ వందారులోకవర-సందాయినీ విమల-కుందావదాతరదనా
బృందార బృందమణి-బృందారవిందమక-రందాభిషిక్తచరణా ।
మందానిలాకలిత-మందారదామభి ర-మందాభిరామమకుటా
మందాకినీజవన-భిందానవాచ మర-విందాననా దిశతు మే ॥

అను శ్లోకమున కనుకరణము. ౯.

## ౧౦. అంతశ్శత్రుగర్హణము - శ్రీకృష్ణసేవనము

***అవతారిక :***

కామము, క్రోధము మొదలగు నంతశ్శత్రువులను జయించి శ్రీకృష్ణునే సేవింపు మని యుపదేశించుచున్నాఁడు-

**శ్లో॥ క్రోధాऽऽకులో విగత-బోధాऽన్వయోऽ సదను-రోధాऽనుగో న భవ భోః**
**సాధారణీ న ఖలు-బాధా భవస్య భువి-గాధా న మోహవసతిః ।**
**వేధా గురుశ్చ పటు-మేధా విభు ర్నహి ని-షేధాయ కర్మవితతే**
**రాధాయ తాత! హృది-రాధా విటాంఘ్రియుగ-మాధారతాం వ్రజ! ముదామ్॥**

౧౦

**వ్యాఖ్య :** భోః తాత = ఓ బాబూ! క్రోధ + ఆకులః = కోపముచే వ్యాకులత్వము నొందిన వాఁడవు; విగత = పోయిన; బోధ + అన్వయః = జ్ఞానానువృత్తి గల వాఁడవు-జ్ఞానశూన్యుఁడవు; అసత్ = చెడ్డ వారికి; అనురోధ = అనుకూలముగా; అనుగః = అనువర్తించు వాఁడవు; న భవ = కా వలదు. భవస్య = సంసారము యొక్క; బాధా = బాధ; సాధారణీ న ఖలు = సామాన్య మైనది గాదు గదా! మోహవసతిః = మోహమునకు స్థాన మైన; గాధా న = కథ స్వల్ప మైనదికాదు. మోహమును జయించుట యంత సులభ కార్యము కాదని భావము. పటు = మిక్కిలి; మేధాః = మేధ-బుద్ధి గలిగిన; వేధాః = బ్రహ్మదేవుఁడు; గురువు = సమస్త విద్యలు నేర్చిన యాచార్యుఁడు కూడ, కర్మవితతేః = కర్మసమూహమును; నిషేధాయ= నిషేధించుటకు - తప్పించుటకు; న హి విభుః = సమర్థులు కారు కదా! ఇక్కడ విభుశబ్దము వేధతో, గురునితోఁ బ్రత్యేకముగా నన్వయించును.

'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్'

మనము చేసిన ప్రాక్తన కర్మము పుణ్య మైనను, పాపమైనను దప్పక యనుభవించి తీరవలసినదే -యను వచనము ననుసరించి ప్రారబ్ధకర్మము నుండి మనలను దప్పించుటకు బ్రహ్మ, గురువు

కూడ సమర్థులు గారు. అందు వలన; రాధావిట = రాధాదేవి కుపపతి యైన శ్రీకృష్ణుని యొక్క; అంఘ్రియుగమ్ = అడుగులజంటను; హృది = హృదయములో; ఆధాయ = నిలిపి; ముదామ్ = సుఖములకు; ఆధారతామ్ = ఆధారత్వమును; వ్రజ = పొందుము.

**తాత్పర్యము :** ఓ తండ్రీ! నీవు కోపముచే వ్యాకులుఁడవై, జ్ఞాన మార్గమును విడిచిన వాఁడవై దుష్టుల మార్గము ననుసరింపకుము. ఈ సంసారబాధ సాధారణమైనది కాదు. మోహమును జయించుట మిక్కిలి కష్టము. నీవు చేసిన శుభాశుభకర్మ ఫలితమును బ్రహ్మ, గురువు కూడఁ దప్పించలేరు. కాఁబట్టి శ్రీకృష్ణుని పాదద్వయమును హృదయములో నిలిపి మోక్షానందమునకుఁ బాత్రుఁడవు కమ్మని భావము.

**విశేషములు :**

(1) ఆగామి (2) సంచితము (3) ప్రారబ్ధము నని కర్మము మూఁడు విధములు. చేయుచున్న, చేయఁబోవుచున్న కర్మ మాగామి. ఇంతకు ముం దనేక జన్మముల నుండి కూడఁబెట్టిన కర్మము సంచితము. ఈ జన్మమునకుఁ గారణమై యీ దేహముతోఁ బ్రారంభించి యనుభవించుచున్న కర్మము ప్రారబ్ధము.

మనము జ్ఞానము సంపాదించి యాగామి-సంచిత కర్మములను బోఁగొట్టుకొన వచ్చును. ప్రారబ్ధ మనుభవించి తీరవలసినదే.

శ్లో॥ జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా (భ.గీ.-4-37)

అర్జునా! జ్ఞాన మనెడు నిప్పు సర్వకర్మములను భస్మము చేయునని భగవానుఁడు చెప్పినాఁడు గదా! జ్ఞానాగ్నివలనఁ బ్రారబ్ధము కూడ నశించును గదా! యన్నచో నది సరిగాదు. ఇక్కడ సర్వకర్మములు ననఁగా నాగామి-సంచిత కర్మము లని యర్థము. జ్ఞానాగ్ని కూడ సంచిత-సంచీయమానకర్మములను భస్మము చేయఁగలదు గాని ప్రారబ్ధకర్మమును దగులఁబెట్ట లేదు. అది యనుభవించుట వల్లనే నశించును.

ఇక్కడ - సామర్థ్యాద్ యేన కర్మణా శరీరమారబ్ధం తత్
ప్రవృత్తిఫలత్వా దుపభోగేనైవ క్షీయతే। అతో యా న్యప్రవృత్త
ఫలాని జ్ఞానోత్పత్తేః ప్రాక్ కృతాని జ్ఞానసహభావీని చాతీతానేక
జన్మకృతాని చ తాన్యేవ సర్వాణి భస్మసాత్కురుతే ॥ -అని శ్రీశంకర భాష్యము.

ఏ ప్రారబ్ధ కర్మము యొక్క సామర్థ్యము వలన నీ శరీర మారంభ మైనదో (పుట్టినదో) యా కర్మము ఫలము నిచ్చుటకుఁ బ్రారంభ మైనది గావున నది యుపభోగము వల్లనే - యనుభవించుట వల్లనే నశించును. జ్ఞానోత్పత్తికి ముం దీశరీరముతోఁ జేసిన కర్మములు, నింతకు ముం దనేక

జన్మములలోఁ జేసిన కర్మములు జ్ఞానాగ్ని వలన భస్మ మగు నని భావము.

శ్లో॥ ప్రారబ్ధం త్విహ భుజ్యతా మథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్॥

ప్రారబ్ధకర్మము నిక్కడే యీ శరీరము తోడనే యనుభవింపవలెను. ప్రారబ్ధకర్మ పరిసమాప్తి యైన పిమ్మట జ్ఞానికి బ్రహ్మప్రాప్తి కల్గునని సాధనపంచకములో భగవత్పాదులే చెప్పినారు.

ఈ విషయమునే శ్రీపద్మపాదాచార్యులు విజ్ఞానదీపికలో సోదాహరణముగా నిట్లు వివరించినారు.

నను 'జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా'–ఇతి
భగవద్వచనాద్ జ్ఞానేన కర్మసమాప్తే రుక్తత్వాత్ కథం కర్మ
సమాప్తి ర్న? ఇత్యాశంక్య కేషాంచిద్ జ్ఞాననాశ్యత్వేఽపి
కేషాంచిత్తు భోగనాశ్యత్వస్యైవ శ్రుత్యుక్తం – న జ్ఞానేన కృత్స్నసమాప్తి రిత్యాహ –

శ్లో॥ ఉభయోర్ జ్ఞానతో నాశో భోగాత్ ప్రారబ్ధకర్మణః ।
క్షేత్రాగారోదరస్థానా మన్నానా మివ తద్భిదా " (వి.ద–9)

**వ్యాఖ్య** – ఉభయో రితి పరోక్షాపరోక్ష భేదేన జ్ఞానం ద్వివిధమ్ తత్ర – 'బ్రహ్మ అస్తి'; 'మదుపాస్యమ్ బ్రహ్మ' ఇతి యద్ జ్ఞానం తత్పరోక్షమ్. బ్రహ్మ సత్యం; జగన్మిథ్యా; బ్రహ్మైవాఖిలం జగత్; ఘటాకాశ – మహాకాశయో రివ; నభస్థ – జలచంద్రయో రివ జీవాత్మపరమాత్మనో ర్నాస్తి భేదః। అతోఽహ మస్మి బ్రహ్మైవ – ఇత్యాకారకం జ్ఞాన మపరోక్షమ్। తయో ర్మధ్యే పరోక్ష జ్ఞానం జనకమ్। అపరోక్షజ్ఞానం తావత్ ప్రారబ్ధేతరకర్మ నాశకమ్। ఏవం చాన్యం జ్ఞాన మపరోక్షమేవ గృహ్యతే – తస్మా దుభయోః సంచిత సంచీయమానయో ర్నాశః బీజలోపః ప్రారబ్ధకర్మణస్తు భోగేనైవ శాంతి ర్నాన్యథా ॥

తత్ర నిదర్శనం యథా – క్షేత్రస్థిత మన్నం సంచీయమానం, గృహస్థ మన్నం సంచితమ్, ఉదరస్థిత మన్నమ్ ప్రారబ్ధమ్। తత్ర క్షేత్రాగారస్థితయో ర్దానాదినా తాత్కాలికక్షయోఽపి సంభవతి। ఉదరస్థాన్నస్యతు భోగాత్ కాలపరిపాకా దేవ క్షయః। ఇత్థం యథాన్నస్య భిదా తథా కర్మభేదోఽపి సంచిత–సంచీయమానయో రేవ కర్మణోర్ జ్ఞాననాశ్యత్వం నారబ్ధస్య తథాచ 'నాభుక్తం క్షీయతే కర్మ' ఇత్యాదౌ కర్మశబ్దస్య ప్రారబ్ధ పరత్వమ్। 'జ్ఞానాగ్నిః సర్వకర్మాణీ'త్యాదౌ సర్వశబ్దః సంచిత– సంచీయమనపర ఇతి మంతవ్యమ్। అవిశేషేణ కర్మభోగ నాశయో రుక్తత్వేఽపి శ్రుతిస్మృతివచో బలాదే వాచార్యైః వ్యవస్థాయా ఉక్తత్వాత్ సంప్రత్యయాచ్చ ప్రామాణ్యం నాశంకనీయ మితి భావః ॥

'జ్ఞానాగ్ని సర్వకర్మములను బూడిద చేయు' నను భగవద్వచనముచే జ్ఞానము వలన

సర్వకర్మసమాప్తి చెప్పఁబడుటచే సర్వకర్మములు నెట్లు నశింప వని యాశంకించి, కొన్ని కర్మములు జ్ఞానము వలన నశించినను మఱికొన్ని కర్మము లనుభవించుట వల్లనే నాశన మగు నని వేదము చెప్పుటచే జ్ఞానము వలన సంపూర్ణకర్మపరిసమాప్తి కా దని చెప్పుచున్నాఁడు.

సంచిత – సంచీయమాన (ఆగామి) కర్మములకు జ్ఞానము వలన నాశము కలుగును. ప్రారబ్ధకర్మము మాత్రము భోగము (అనుభవించుట) వల్లనే నశించును. పొలము నందలి యాహారము వలె, నింటి యందలి యాహారము వలెఁ గడుపులోని యాహారము వలె వాని భేదము తెలియవలయును.

(1) పరోక్షము (2) అపరోక్షము నని జ్ఞానము రెండు విధములు; వీనిలో – 'బ్రహ్మము కలదు. నా చేత బ్రహ్మ ముపాసింపఁదగినది' యను జ్ఞానము పరోక్షము. బ్రహ్మము సత్యము. జగత్తు మిథ్య. బ్రహ్మమే జగ మంత నిండి యున్నది. కుండ యందలి శూన్యప్రదేశము, ఆకాశము నందలి శూన్యప్రదేశము వలె; ఆకాశము నందలి చంద్రుడు, నీటి యందలి చంద్రుఁడు వలె జీవాత్మకుఁ బరమాత్మకు భేదము లేదు. అందువల్ల నా బ్రహ్మమే నేనై యున్నా నను జ్ఞాన మపరోక్షము. వీనిలోఁ బరోక్షజ్ఞాన మపరోక్షజ్ఞానమునకు జనకమై జన్మమునకుఁ గారణ మగుచున్నది. అపరోక్షజ్ఞానము ప్రారబ్ధేతరకర్మము లగు సంచిత – సంచీయమాన (ఆగామి) కర్మములను నాశనము చేయును. తక్కిన జ్ఞాన మంతయు నపరోక్షమే. అపరోక్షజ్ఞానమువలన సంచిత సంచీయమానములగు కర్మములు సబీజముగా నశించును. మఱల మొల కెత్తవు. ప్రారబ్ధకర్మము భోగము వల్లనే నశించును. దీనికి నిదర్శనము చెప్పుచున్నాఁడు – పొలములో నున్న యాహారము సంచీయమానము. ఆగామి – ప్రోఁగు చేయఁబడునది. ఇంటిలో నున్న యాహారము సంచితము. ప్రోఁగుచేయఁబడినది. కడుపు లోని యాహారము ప్రారబ్ధము. వీనిలో క్షేత్రస్థితాహారమునకు, గృహస్థాహారమునకు దానాదుల వలనఁ దాత్కాలికక్షయము సంభవించును. ఉదరము లోని యాహారమునకు మాత్రము భోగము వలనఁ గాలపరిపాకము వలన క్షయము సంభవించును. ఈ విధముగా నన్న మెట్లు భేదించుచున్నదో కర్మము కూడ నట్లే భేదించును. సంచిత – సంచీయమానకర్మములు మాత్రమే జ్ఞానము వలన నశించును. ప్రారబ్ధము నశింపదు. 'నా భుక్తం క్షీయతే కర్మ' భోగింపనిదే కర్మము క్షీణింపదు – మొదలగు వచనములలోఁ గర్మశబ్దమునకుఁ బ్రారబ్ధకర్మ మని యర్థము. 'జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే' జ్ఞానాగ్ని సర్వకర్మములను బూడిద చేయును మొదలగు వచనముల లోని సర్వశబ్దము సంచిత – సంచీయమాన కర్మపరము. ఈ విధముగా జ్ఞానము వలన నశేషకర్మములకు వాని భోగములకు నాశనము చెప్పఁబడినను శ్రుతి – స్మృతి వచనోదాహరణపూర్వకముగా శ్రీశంకరాచార్యులచే వ్యవస్థచేయఁబడుటచే నావచనములందలి విశ్వాసముచే నీవిషయములో శంకింపఁదగదు.

ఇక్కడ శ్రీపద్మపాదాచార్యులు కర్మముల కన్నముతోఁ జక్కని యుదాహరణ మిచ్చినారు.

ఈ యుదాహరణమునే మఱియొక విధముగా నిట్లు చెప్పవచ్చును. మనము తినుటకై విస్తరిలో వడ్డించుకొన్న భోజన మాగామి. తినినఁ దినవచ్చును. మానిన మానవచ్చును. నోటిలో నములుచున్న యన్నపు ముద్ద సంచితము. ఇది కూడ మ్రింగిన మ్రింగ వచ్చును. ఉమిసిన నుమియ వచ్చును. గుటక వేసి మ్రింగిన ముద్ద ప్రారబ్ధము. కడుపులోఁ బడిన యన్న మరుగు వఱకు భోగించుచు (అనుభవించుచు) వేచి యుండవలసినదే. వేఱు మార్గము లేదు.

ప్రారబ్ధకర్మ మంత బలీయమై పుట్టుకకుఁ జావునకు హేతు వగుచున్నది. అందువల్లనే కవి యిక్కడఁ గర్మ ఫలమును బ్రహ్మ కాని గురువు కాని తప్పింప లే రని ముందు చెప్పినాఁడు.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥ (భ.గీ - 18 - 66 )

"సమస్తధర్మములను (కర్మములను) విడిచిపెట్టి నన్నొక్కనే శరణు పొందుము. నేను నిన్ను సర్వపాపముల నుండి విముక్తునిఁ జేయుదును. శోకింపకు" మని శ్రీకృష్ణభగవానుఁ డభయ మిచ్చినాఁడు. అందువల్లనే శ్రీకృష్ణునే హృదయములో నిలిపి మోక్షము నొందు మని కవి యుపదేశించినాఁడు. ౧౦

## ౧౧. జనన మరణగర్హణము - శివసేవనము

***అవతారిక :***

స్వర్గలోకము చేరినను జననమరణాదులు తప్పవు. కనుక శివునే భజింపు మని యుపదేశించుచున్నాఁడు-

**శ్లో॥ నానావిధే జనుషి-కా నామ సౌఖ్యయుజి-రానాకపృష్ఠ మపివా**
**జానాసి యద్విషయ-సూనారుచి ర్భవసి-దూనాశయో భృశతరమ్ ।**
**మానాతిగో విహిత-దానాధ్వరాది రిహ-కీనాశభీతిరహితో**
**మీనాయతాక్ష మధి-గానాదరం కలయ!-సూనాస్త్రజీవనహరమ్ ॥** ౧౧

**వ్యాఖ్య :** నానావిధే = మనుష్యులు, దేవతలు, పశుపక్ష్యాదులు మొదలగు ననేక ప్రకారమైన; జనుషి = జన్మమునందు; 'జను ర్జనన జన్మాని' - అని యమరము. సౌఖ్యయుజిః = సుఖయోగము; ఆనాకపృష్ఠమ్ = స్వర్గలోకపర్యంతము; అపివా = (వెళ్ళినను) గూడ; కానామ? = ఏమికలదు? స్వర్గాదిలోకములు కూడ క్షయము నొందున వగుటచే నక్కడఁ గూడ సౌఖ్యము శాశ్వతము కాదని భావము. ఈ భూలోకములో నీర్ష్య, ద్వేషముమొదలగు వాని వలన గలిగిన

క్లేశము వలెనే స్వర్గాదిలోకములలోఁ గూడఁ బుణ్యతారతమ్యముచే భోగముల యొక్క యెక్కువ తక్కువ లుండుట చేతను, పుణ్యము క్షీణించినంతనే మఱల భూలోకములోఁ బడు భయ ముండుట వల్లను భూలోకక్లేశము కంటె స్వర్గలోకక్లేశమే యధికమైనది. ఈ విషయమును నేనే చెప్ప నక్కఱ లేదు. నీవే తెలిసికొందువు. యత్ = ఏది; విషయ = శబ్ద స్పర్శ రూప రస గంధ విషయములను బొందుటకై; సూనా = రాగప్రాప్తిలో; రుచిః = అభిరుచి – అభిలాష కలవాఁడవు; భవసి = అగుచున్నావు. తత్ = ఆ విషయరాగరుచి పొందుట; భృశమ్ = అత్యంతము = మిక్కిలి; దూన + ఆశయః = ఎక్కువక్లేశము గలుగుటచేఁ బరితపించిన మనస్సు గల వాఁడవై; జానాసి = ఈ లోకము నందుఁ గాని, పరలోకము నందుఁ గాని సుఖము లోక పోవుట తెలిసికొందువు. 'జానాసి' యను చోట వర్తమానసామాప్యముచే వర్తమాన (లట్) ప్రయోగము. ఇహాముత్రఫలభోగములు రెండును క్లేశము లైనచో నేమి చేయవలయునో చెప్పుచున్నాఁడు. మాన + అతిగః =మితి నతిక్రమించి వెళ్ళువాఁడవై; నే నిన్ని దానములు చేయుదును, ఇన్ని యాగములు చేయుదు నను మితి లేనివాఁడవై; లేక – మానాతిగః = అభిమానము నతిక్రమించి వెళ్ళు వాఁడవై – నేనిన్ని గొప్ప పనులను జేయుచుంటి నని యభియానము లేని వాఁడవై; లేక లోకులభిమానించినను, అవమానించినను లెక్కింపక సమబుద్ధి కలవాఁడవై; ఇహ = ఈ లోకములో; విహిత =చేయఁబడిన; దాన + అధ్వర + ఆదిః = దానములు, యజ్ఞములు మొదలగునవి కలవాఁడవై; కీనాశభీతిరహితః = యమునివలన భయము లేని వాఁడవై – అనఁగా మరణభయమును విడిచిపెట్టిన వాఁడవై; మీన + ఆయత + అక్షమ్ = చేఁపల వలె విశాలమైన కన్నులు గల వానిని; అధి = మిక్కిలి; గాన = సంగీతమునందు; ఆదరమ్ = ప్రీతి గల వానిని; సూన + అస్త్ర – సూనాస్త్ర = పువ్వులే యమ్ములుగాలఁ గల మన్మథుని యొక్క; జీవన = జీవితమును; హరమ్ = హరించిన వానిని; మన్మథుని జంపిన శివుని; కలయ = సేవింపుము – పొందుము.

***తాత్పర్యము :*** నానావిధము లయిన జన్మములు గల నీవు స్వర్గమునకు వెళ్ళినను విషయసుఖములు శాశ్వతములు గావని తెలిసిన వాఁడవై మానాభిమానములు విడిచిపెట్టి చేత నైనంతవఱకు దానములను యజ్ఞములను నాచరించి చిత్తశుద్ధి పొంది మరణభీతి లేని వాఁడవై విశాలాక్షుఁడు; సంగీతరసికుఁడు మన్మథజేత యగు పరమశివుని సేవింపు మని భావము.

***విశేషములు :***

పుండరీకాక్షుఁ డను పదము విష్ణువు నందు రూఢ మైనట్లుగా మీనాక్షుఁ డను పదము

శివుని యందు రూఢము గాదు. మధుర లోని యమ్మవారు మీనాక్షి. మీనాక్షికి భర్త యగు సుందరేశ్వరుఁడు కూడ మీనాక్షుఁడే యని కవి భావించినట్లు తలంపవలెను.

*సూన :*

'సూనాధోజిహ్వికాపి చ' 'సూనా పుత్ర్యాం వధస్థాన గళశుంఠికయో రపి' సూనాశబ్దమునకు వధస్థానము, కొండనాలుక యను నర్థములే సంస్కృతనిఘంటువు లన్నింటఁ గలదు. అయినను 'సూనాయాం రాగప్రాప్తాయాం వా, రుచి రభిలాషః' –అని దర్పణవ్యాఖ్యానము నందుండుటచే నట్లే వ్యాఖ్యానించితిని. ౧౧

## ౧౨. లౌకికసౌఖ్యగర్హణము – శ్రీకృష్ణశరణాగతి

*అవతారిక :*

ఎన్నో ద్వీపముల కేఁగి యెందఱో రాజులను సేవించితిని. కాని కొంచెము కూడ సుఖము లేదు. కాఁబట్టి కృష్ణా! నీవే నన్ను రక్షింపు మని వేఁడు చున్నాఁడు –

**శ్లో॥ సాపాయ మేత్య వపు–రాపాతరమ్య మను–తాపాదృతే సకుతుకం**
**ద్వీపా నగాహిషి స–మీపాతిగా నకృత–భీపాతఖేదగణనః ।**
**భూపా నసేవిషి సు–రూపాఽఽకృతేఽహహ న–తూపాగమం సుఖలవం**
**గోపాయ! మాం సపది–గోపాలధుర్య! తవ–కోపాయ నాఽస్మి విషయః ॥ ౧౨**

**వ్యాఖ్య :** స + అపాయమ్ – సాపాయమ్ = అపాయముతోఁగూడినది. జబ్బులు, చావు మొదలగు నపాయములు గల దని భావము. ఆపాతరమ్యమ్ = ఆపాతరమణీయమైనది – పైపై మెఱుఁగులు గలది యగు; వపుః = దేహమును; ఏత్య = పొంది; అనుతాపాత్ + ఋతే = అనుతాపాదృతే = పశ్చాత్తాపము లేనివాఁడనై;

'పశ్చాత్తాపోఽనుతాపశ్చ విప్రతీసార ఇత్యపి'
'పృథగ్వినాంతరేణర్తే హిరుఙ్నానా చ వర్జనే'

అని యుభయత్ర యమరము. సకుతుకమ్ = కుతూహలముతో; అ + కృత + భీ + పాత + ఖేదగణనః = భయము, పాటు; దుఃఖము మొదలగు వానిని లెక్కింపని వాఁడనై; సమీప + అతిగాన్ = దగ్గఱలో లేని; అనఁగా దూరముగా నున్న; ద్వీపములను సింహళాదిదేశములను; అగాహిషి = చేరితిని. ధనాశతో దూరదేశముల కేఁగితి నని భావము. భూపాన్ = రాజులను; అసేవిషి = సేవించితిని. అహహ! = అయ్యో! సుఖలవమ్ = కొంచె మైనను సుఖమును; నతు + ఉపాగమమ్ = పొంద లేక పోయితిని.

సు + రూప + ఆకృతే! = మంచిరూపము, ఆకారము గలవాఁడా! గోపాలధుర్య = గోపాలకులలో శ్రేష్ఠుఁడ వైన ఓ శ్రీకృష్ణా! సపది = ఇప్పుడే; మామ్ = నన్ను; గోపాయ = రక్షింపుము. తవ = నీ యొక్క; కోపాయ = కోపమునకు; విషయః = విషయమును; న + అస్మి = కాను.

**తాత్పర్యము :** అనేకాపాయములతో నాపాతరమణీయ మైనది (పడు నంతవరకే - దిగునంత వఱకే సుందరముగాఁగన్పట్టునది) యగు నీదేహమును బొంది, యనేక పుణ్యపాపకర్మములను జేయుట వలన నిట్లు జన్మించితి నను పశ్చాత్తాపము లేక పడరాని పాట్లు పడి భయమును గష్టములను లెక్కింపక డబ్బు సంపాదింప వలెనను కుతూహలముతో సముద్రములు దాఁటి దూరదేశముల కేఁగి యనేకరాజులను సేవించితిని. కాని కొంచెము కూడ సుఖము లభింపలేదు. వీఁడు నన్ను సేవింపక పెఱ రాజులను స్తుతించినాఁడని నాపైఁ గోపింపకుము. సుందరాకారా! శ్రీకృష్ణా! యిప్పుడే వచ్చి నన్ను రక్షింపుము.

**విశేషము :**

ఇట్టి ప్రాసము గల పద్యము కాళిదాసు రచించిన దేవీస్తుతిలోఁ గూడఁ గలదు గాని దాని కిది యనుకరణము గాదు.

శ్లో॥ ద్వైపాయన ప్రభృతి - శాపాయుధ త్రిదివ - సోపానధూళి చరణా
పాపాపహస్వమను - జాపానులీనజన - తాపాపనోదనిపుణా।
నీపాలయా సురభి - ధూపాలకా దురిత - కూపా దుదంచయతు మాం
రూపాధికా శిఖరి - భూపాలవంశమణి - దీపాయితా భగవతీ॥ ౧౨.

## ౧౩. కామినీగర్హణము - అంబాసేవనము

**అవతారిక :**

ఆఁడువారి విలాసములు ముందు తియ్యగా నున్నను గడపటికి మిక్కిలి చేఁదైనవి. కాఁబట్టి జగదంబనే స్మరింపు మని బోధించుచున్నాఁడు-

**శ్లో॥ కిం బాల! న స్ఫురతి?-సంబాధకమ్ భృశవి-డంబాస్పదమ్ పరిణతౌ**
**నింబాది తిక్తరస-సంబాధ మత్ర నను-బింబాధరావిలసితమ్ ।**
**లంబాలకాం ధుతవి-లంబాదరాం ఘుసృణ-జంబాలజాలవిలసద్**
**బింబా మనూనశశి-బింబాననాం సతత-మంబా ముపాస్వ సదయామ్ ॥** ౧౩

**వ్యాఖ్య :** బాల = అబ్బాయీ! బింబ + అధరా = దొండపండు వంటిపెదవులుగల స్త్రీలయొక్క; విలసితమ్ = విలాసము, సంబాధకమ్ = మిక్కిలిబాధగల్గించునది. భృశ = మిక్కిలి; విడంబ + ఆస్పదమ్ = మోసములకుస్థానమైనది; పరిణతౌ = పరిణామక్రమములో; నింబ + ఆది =

వేఁపాకుమొదలగువానివలె; తిక్తరస = చేఁదైనరసముతో; సంబాధమ్ = కూడినది యని; అత్ర = ఇక్కడ; నను = నిశ్చయముగా; న స్ఫురతి కిమ్ = స్ఫురించుటలేదాయేమి?. అందువలనఁగామినీ భోగములువిడిచిపెట్టుము. విడిచిపెట్టియేమిచేయవలయునో చెప్పుచున్నాఁడు. లంబ + అలకామ్ = వ్రేలాడు ముంగురులుగలదానిని; ధుత = త్రోయఁబడిన – తిరస్కరించిన; విలంబ + ఆదరామ్ = ఆలస్యముతోఁగూడిన యాదరముగలదానిని; ఆలసింపకుండ భక్తులను రక్షించుటలో నాదరముగలదానిని; ఘుసృణ = కుంకుమపువ్వు యొక్క ; జంబాలజాల = పంకసమూహమువలె, కుంకుమపువ్వు రసమువలెనెఱ్ఱఁదనముతో; విలసత్ = ప్రకాశించుచున్న; బింబామ్ = దొండపండువంటి పెదవిగలదానిని; ఇక్కడనోష్ఠ శబ్దములోపించినది. బింబశబ్దముచేఁదదుపమేయభూతమగు నోష్ఠమును గ్రహింపవలెను; న + అనూన = అనూన = తక్కువకాని నిండైన; శశి = చంద్రుని యొక్క; బింబ = బింబమువంటి; ఆననామ్ = ముఖముగలదానిని; సదయామ్ = కరుణతోఁగూడిన దానిని; అంబామ్ = జగదంబయగు పార్వతీదేవిని; సతతమ్ = ఎల్లప్పుడు; ఉపాస్వ = ఉపాసింపుము.

**తాత్పర్యము :** బాలకా! నీవు స్త్రీల విలాసములు చూచి మోసపోవుచున్నావు. దొండపండు వంటి పెదవులు గల యువతుల విలాసములు మిక్కిలి బాధగల్గించునవి. పురుషుల నెక్కువగా మోసపుచ్చునవి. ముందుతియ్యగానున్నను జివరకు వేఁపరసమువలె మిక్కిలి చేఁదైనవని నీకుఁదెలియుటలేదా? కావునఁగామినులను గామింపకుము, వ్రేలాడు ముంగురులు గలది, భక్తులను రక్షించుటలోనేమఱుపాటు లేనిది, కుంకుమపువ్వు రసము వంటి యెఱ్ఱనైన పెదవులుగలది, పూర్ణచంద్రబింబమువంటి ముఖము గలది, యెల్లలోకములకుఁదల్లియునగు పార్వతీ దేవినే సేవింపుము.

***విశేషములు :***

అంబ, అమ్మ, దేవిమొదలగుశబ్దము లమ్మవారి యందు రూఢములు. నిరుపపదములగు నీపదములు పార్వతీదేవినే బోధించును.

ఈ శ్లోకము కాళిదాసురచించిన దేవీస్తుతిలోని –

శ్లో॥ కంబావతీవ సవి–డంబా గళేన నవ – తుంబాభవీణసవిధా
బింబాధరా వినత – శంబాయుధాదినికు–రుంబా కదంబవిపినే।
అంబా కురంగమద – జంబాలరోచి రిహ – లంబాలకా దిశతు మే
శం బాహులేయశశి – బింబాభిరామముఖ – సంబాధితస్తనభరా॥

అను శ్లోకమున కనుకరణము. ౧౩

## ౧౪. యజ్ఞాదిఫలగర్హణము - నరసింహసేవనము

**అవతారిక :**

యజ్ఞములుచేయుట వలనఁగలుగు స్వర్గాదిసుఖములు శాశ్వతములుకావు. కావున శ్రీనరసింహస్వామిని సేవింపుమని యుపదేశించుచున్నాఁడు-

**శ్లో॥ రంభాదిగాఢపరి-రంభాऽऽదరేణ సుచి-రం భావతోऽత్ర యజసే**
**త్వం భావయస్వ! కిము-శం భావ్యనేన జడ! సంభావితక్షయమిదమ్ ।**
**స్తంభా దుదిత్వర మ-హంభావతః కలయ!-జంభారిసంస్తుతపదం**
**తం భావుకప్రద మ-దంభాऽऽకులో నఖర-సంభారదారితరిపుమ్ ॥** ౧౪

వ్యాఖ్య : రంభా + ఆది = రంభ మొదలగు స్వర్గము నందలి యప్సరసల యొక్క; గాఢ = గాటముగా; పరిరంభ = కౌఁగిలించుకొనుటయందలి; ఆదరేణ = ఆదరముతో - లోలుపత్వముచే; సుచిరమ్ = ఎక్కువకాలము; భావతః = శ్రద్ధతో; అత్ర = ఈలోకములో; యజసే = జ్యోతిష్టోమము మొదలగుయజ్ఞములుచేయుచున్నావు. అనేన= ఈయాగములు చేయుట వలన; శమ్ = శుభము; కిముభావి = ఏమికల్గునో; త్వమ్ = నీవు; భావయస్వ = భావింపుము- విచారింపుము. జడ = ఓరి మూర్ఖుఁడా! ఇదమ్ = ఇది యంతయు; సంభావిత = బాగుగా నాలోచించినచో; క్షయమ్ = నాశన మగునది. కాఁబట్టి; అదంభ + ఆకులః = దంభముచే నాకులత్వము నొందని వాఁడవై. అహంభావతః = ఆ భగవంతుఁడనే నేనను నేకాకారవృత్తితో; జంభారి = జంభుఁడను రాక్షసునకు శత్రు వైన యింద్రునిచే; సంస్తుత = బాగుగా స్తుతింపఁబడిన; పదమ్ = పాదములు గల వానిని; భావుకప్రదమ్ = క్షేమము లిచ్చు వానిని; నఖర = గోళ్ళ యొక్క; సంభార = సమూహముచే - గోళ్ళను నాయుధసామగ్రిచే; విదారిత = చీల్చఁబడిన; రిపుమ్ = శత్రు వగు హిరణ్యకశిపుఁడు గల వానిని; స్తంభాత్ = స్తంభము నుండి; ఉదిత్వరమ్ = పుట్టిన వానిని; 'ఇణ్ - గతౌ' - అని ధాతువు. ఇణ్ నశజిసర్తిభ్యః క్వరప్ (3-2-163) అను సూత్రముచే 'ఉత్' - పూర్వక - ఇణ్ ధాతువునకు - 'క్వరప్' ప్రత్యయము చేరి 'ఉదిత్వర' - అని యేర్పడును. ఉదిత్వరుఁడు = ఉద్గమించు (పుట్టు) శీలము గలవాఁ డని యర్థము. తమ్ = ప్రసిద్ధుఁ డగు నా నరసింహస్వామిని; కలయ = ధ్యానింపుము.

**తాత్పర్యము :** ఓరి మూఢుఁడా! చని పోయిన పిమ్మట స్వర్గమున కేఁగి రంభ, మేనక మొదలగు స్వర్గవేశ్యల బిగి కౌఁగిళ్ళలో సుఖింప వచ్చు నని యిక్కడ ననేకక్లేశముల కోర్చియజ్ఞములు చేయుచున్నావు. దీని వలన నేమి శుభము గల్గునో విచారింపుము. ఈ రంభాసంభోగాది

స్వర్గసుఖములు కూడ శాశ్వతమైనవికావు. కావున దంభము(కపటము ) లేని వాఁడవై యింద్రునిచే నెక్కువగాఁ బొగడఁబడిన పాదములు గల వానిని; సకలశుభములు నిచ్చు వానిని; స్తంభము నుండి యుదయించిన వానిని; వాఁడి యైన గోళ్ళతో హిరణ్యకశిపునిఁ జీల్చిన వానినిఁ బ్రసిద్ధుఁ డగు శ్రీనరసింహస్వామినిఁ దాదాత్మ్యబుద్ధితో సేవింపుము.

ఈ శ్లోకము కాళిదాసు రచించిన దేవీస్తుతి లోని –

శ్లో॥ జంభారికుంభిపృథు – కుంభాపహాసికుచ – సంభావ్యహారలతికా
రంభాకరీంద్రకర – దంభాపహోరుగతి – డింభానురంజితపదా।
శంభా వుదారపరి – రంభాంకురత్పులక – దంభానురాగపిశునా
శం భాసురాభరణ – గుంభా సదా దిశతు – శుంభాసురప్రహరణా॥

అను శ్లోకమున కనుకరణము. ౧౪

## ౧౫. పార్వతీస్తుతి

***అవతారిక :***

ఇప్పుడు కవి పార్వతీదేవిని స్తుతించి తన్ను రక్షింపవలె నని కోరుకొనుచున్నాఁడు –

**శ్లో॥ రామాఽర్చితాఽంఘ్రిరభి–రామాఽఽకృతిః కృతవి–రామా సుపర్వవిపదాం**
**కామాఽర్తిహృ త్సఫల–కామా నిదేశరత–కామాఽఽది నిర్జరవధూః ।**
**భామా హరస్య నుత–భామా జపాసదృశ–భా మాననీయచరితా**
**సా మా మవ త్వఖిల–సామాదృతస్తుతి ర–సామాన్యముక్తిసుఖదా ॥ ౧౫**

***వ్యాఖ్య :*** రామ = శ్రీరామచంద్రునిచే; అర్చిత= పూజింపఁబడిన; అంఘ్రిః = పాదములు గలది; అభిరామ = అందమైన; ఆకృతిః = ఆకారము గలది; సుపర్వ = దేవతలయొక్క; విపదామ్ = ఆపదలను; విరామా = నాశనము చేయునది; కామ + ఆర్తి = కోరికలను దుఃఖములను; హృత్ = హరించునది – పోఁగొట్టునది; సఫలకామా = పండినకోరికలు గలది; లేక – కామార్తి = కామము మొదలగు దుఃఖములతో నిండిన; హృత్ = హృదయము గల భక్తుల యొక్క; సఫలకామా = కోరికలను సఫలము చేయునది; నిదేశ = తన యొక్క యాజ్ఞ యందు; రత = తత్పర లగు; కామ + ఆది నిర్జరవధూః = రతి మొదలగు దేవతాస్త్రీలు కలది; దేవతాస్త్రీ లందఱు తన యాజ్ఞకు లోఁబడి వర్తింతు రని భావము. హర = శివుని యొక్క; భామా = కాంత – భార్య యైనది; నుత = పొగడఁబడిన; భామా = కోపము గలది; 'భామః క్రోధే రవౌ దీప్తౌ' – అని మేదినీ కోశము. మహిషాదిరాక్షసులను జంపు సమయములో

నమ్మవారి కోపము కూడ దేవతలకు స్తుతిపాత్ర మైన దని భావము. 'కోపనా సైవ భామినీ' – అని యమరము. భామ – క్రోధే – అని ధాతుపాఠము. జపాసదృశభా = దాసనపువ్వుతో సమానమైన యెఱ్ఱని కాంతి గలది. మాననీయచరితా = పూజింపఁదగిన చరిత్రము గలది, అఖిలసామ = సమస్తసామవేదసూక్తులచే; ఆదృత = ఆదరింపఁబడిన; స్తుతిః = స్తోత్రము గలది, అసామాన్య = సామాన్యము కాని – గొప్పదైన; ముక్తిసుఖదా = మోక్షసౌఖ్యము నిచ్చునది యగు; సా = ఆ పార్వతీదేవి; మామ్ = నన్ను; అవతు = రక్షించుఁగాక!

**తాత్పర్యము :** శ్రీరామునిచే నర్చింపఁబడిన పాదములు గలది, మిక్కిలి సౌందర్యవతి, దేవతల విపత్తులను బాఱఁద్రోలునది, కోరికలను దుఃఖములతో నిండిన హృదయములు గల భక్తుల కోరికలు తీర్చునది, తన యాజ్ఞ ననుసరించి వర్తించు రతి మొదలగు దేవతాస్త్రీలు కలది, శివునకు భార్య యైనది, యుద్ధరంగములోఁ గోపించు నప్పుడు కూడఁ బొగడఁబడునది, జపాకుసుమము వలె నెఱ్ఱనైన కాంతి గలది, గౌరవింపఁ దగిన చరిత్ర గలది, సామవేదముచే స్తుతింపఁ బడినది, యసామాన్య మగు మోక్షానందమును బ్రసాదించునది యగు శ్రీపార్వతీదేవి నన్ను రక్షించుఁగాక!. ౧౫

## ౧౬. ఏషణాత్రయదూషణము – విష్ణుస్తుతి

**అవతారిక :**

ధనైషణ, దారైషణ, పుత్త్రైషణ మొదలగు బాధల నుండి విడిపించి తన్ను రక్షింపు మని విష్ణువును వేఁడుకొనుచున్నాఁడు.

**శ్లో॥ మాయా తవేయ మురు–గాయాఽవివేకనిధి–మాయామినీ కిమపి మా**
**మాయాసయ త్యకృత–జాయాతనూజధన–కాయాదిదోషకలనమ్ ।**
**సా యాతనా తు నిర–పాయా మతా జగతి–హా! యామి కం ను శరణమ్**
**మాయానివాస! పరి–పాయా నవాంబుధర–దాయాదదేహ! భగవన్ ॥** ౧౬

**వ్యాఖ్య :** ఉరుగాయ= పెక్కుమందిచే గానము చేయఁబడువాఁడా! పురుష్టుతా! లేక–యెక్కువ మందిచేఁ బొందఁదగిన వాఁడా!; తవ = నీ యొక్క; ఇయమ్ = ఈ; మాయా = మాయ; ఆయామినీ = మిక్కిలి విస్తార మైనది. అవివేకనిధిమ్ = అవివేకమునకు నిధినగు; మామ్ = నన్ను; అకృత = చేయఁబడని – దీనికి దోషకలనముతో నన్వయము. జాయా = భార్య; తనూజ = కొడుకు; ధన = ధనము; కాయ = దేహము నను వాని యందు; దోషకలనమ్ = దోషచింత కలవానిని; 'అకృత' యనునది యిక్కడ కన్వయించును. అనఁగా భార్యా – పుత్త్ర – ధన – దేహములందుఁ గల దోషములను విచారింపని నన్నని భావము. కిమపి = ఏదో

విధముగా; ఆయాసయతి = ఆయాసపడునట్లు చేయుచున్నది. సా = ఆ ప్రసిద్ధమైన; యాతనా = మరణాది కాల దుఃఖము; జగతి = ఈ లోకములో, నిరపాయా = చికిత్స చేయుటకు వీలులేనిది – తప్పించుకొనుటకు శక్యము కాని దని; మతా = అందఱకుఁ దెలిసిన యభిప్రాయము. హా = అయ్యో! కమ్ = ఎవనిని; శరణం యామి = శరణని చేరుదును. మాయానివాస! = మాయ యందు నివసించువాఁడా! కూటస్థుఁడా!; నవ+అంబుధర = క్రొత్త మేఘమునకు; దాయాద = బంధువైన; దేహ = శరీరము కల వాఁడా! నీలమేఘశ్యామా!; భగవన్ = భగవంతుఁడా! మహావిష్ణూ! పరిపాయాః = రక్షింపుము.

***తాత్పర్యము :*** సర్వలోకస్తుతా! యందఱకు గతివైన పరమేశ్వరా! నీ మాయ జగత్తంతయు నావరించి విస్తారముగా నున్నది. భార్యయందు, సంతానమునందు, ధనమునందు, దేహమునందుఁ గల వ్యామోహముతో వీని దోషము తెలియని యవివేకి నగు నన్ను మిక్కిలి బాధించు చున్నది. పుట్టునప్పుడు, చచ్చునప్పుడు జీవుఁడు పొందు యాతన వైద్యము చేయుటకుఁ గాని తప్పించు కొనుటకుఁ గాని శక్యము గాని దని యీ జగత్తులో నందఱకుఁదెలియును. ఇట్టి పరిస్థితిలో నే నెవరిని శరణు వేఁడుదును. మాయ కతీతుఁడవై మాయ యందే నివసించు కూటస్థపురుషా! నవనీలమేఘశ్యామల శరీరా! భగవానుఁడా! మహావిష్ణూ! నీవే నన్ను రక్షింపుము.

***విశేషములు:***

***1) మాయ :***

మాయ యనునది నిర్వచించుటకు శక్యము కానిది. ఉన్నది లేనట్లుగా లేనిది యున్నట్లుగాఁ జేయునది మాయ. 'యా మా సా మాయా'. ఏది లేదో యది మాయ యని మాయాశబ్దమునకు వ్యుత్పత్తి.

'స్యాన్మాయా శాంబరీ' – యని యమరకోశము
'మాత్యస్యాం విశ్వమితిమాయా' – మా. మానే.

దీని యందు జగత్తు మితమై యుండును – అని గురుబాలప్రబోధిక. మాయా. స్త్రీ. మా+యత్ (1) ఛద్మని కాపట్యే – అమరః (2) ఇంద్ర జాలాదౌ (3) మిథ్యాబుద్ధి హేత్వజ్ఞాన భేదే... ... ఈశ్వరస్యోపాధౌ. అఘటన ఘటన సాధికాయాం శక్తౌ॥ అని వాచస్పత్యము.

లేనిది యున్నదని, యున్నది లేదని మిథ్యాబుద్ధికి హేతువైన యజ్ఞానము మాయ. భగవంతున కుపాధి యైనది మాయ. అఘటన ఘటనా సమర్థమైన యోకానొక శక్తికి మాయ యని పేరు. ఈ మాయ యనేక విధములుగా నుండును.

ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే. (ఋక్–4–7–33)

ఇంద్రుఁ డనేకమాయలచే ననేకరూపములు ధరించుచున్నాఁడని యీ వాక్యమున కర్థము.

ఇంద్రో మాయాభిః జ్ఞానవామైతత్। జ్ఞానై రాత్మీయైః సంకల్పైః పురురూపో బహువిధశరీరః సన్ ఈయతే - బహూన్ యజమానాన్ గచ్ఛతి॥ - ఇక్కడ మాయాశబ్దము జ్ఞానవాచక మని సాయణభాష్యము. వేదాంతగ్రంథములలో నీవాక్యము మాయాపరముగానే యుదాహరింపఁ బడినది.

మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్ ।
తస్యావయవభూతై స్తు వ్యాప్తం సర్వ మిదం జగత్ ॥ (శ్వేతా-4-10)

అని శ్వేతాశ్వరతరోపనిషత్తు.

"ప్రకృతే ర్మాయాత్వం తదధిష్ఠాతృసచ్చిదానందరూపబ్రహ్మణ
స్తదుపాధివశా న్మాయిత్వం చ చిద్రూపస్వమాయావశాత్ ।
కల్పితావయవభూతైః కార్యకారణ సంఘాతైః సర్వభూరాదీదమ్
పరిదృశ్యమానం జగద్వ్యాప్తమ్॥" అని శంకరభాష్యము.

కనఁబడు ప్రకృతియే మాయ. మాయ కలవాఁడు మాయి. ఈశ్వరుఁడు. ప్రకృతి కధిష్ఠాతయై సచ్చిదానందస్వరూపుఁ డగు నీశ్వరున కుపాధివశముచే మాయిత్వము గల్గినది. చిద్రూపమునకు మాయావశముచేఁ గల్పింపఁబడిన యవయవ భూతములగు కార్యకారణసంఘాతములచే భూరాదిలోకములతోఁ గనఁబడు నీజగత్తంతయు వ్యాపింపఁబడినది. అనఁగా నీ జగత్తంతయు మాయాకల్పిత మని భావము.

ఈ మాయాస్వరూపమును వివరించుటకే బ్రహ్మసూత్ర భాష్యమున కుపోద్ఘాతముగా నధ్యాస భాష్యమును శ్రీశంకర భగవత్పాదులు నిబంధించినారు.

"కోఽయ మధ్యాసో నామేతి... శుక్తికా హి రజతవ దవభాసతే, ఏక శ్చంద్రః సద్వితీయవ దితి... తమేత మేవం లక్షణ మధ్యాసమ్ పండితా అవిద్యేతి మన్యంతే। తద్వివేకేన చ వస్తుస్వరూపావధారణం విద్యా మాహుః॥"

ముత్యపుఁజిప్ప వెండి వలె భాసించుట, యొకే చంద్రుఁ డిద్దఱుగా భాసించుట యధ్యాసము. ఇదే యవిద్య. అజ్ఞానము. ఈ యజ్ఞానము వల్లనే జీవుఁడు బంధములోఁ జిక్కుకొనుచున్నాఁడు. ఈ యవిద్య (అజ్ఞానము) విద్య (జ్ఞానము) వలన నశించును. జ్ఞానము వలన స్వస్వరూపప్రాప్తి గల్గును. అనఁగా నీలోక వ్యవహారమంతయు మాయ వల్లనే కలుగుచున్నది.

అందువల్లనే పంచపాదికాకారు లధ్యాసభాష్యమును సర్వతంత్రోపోద్ఘాత మని కీర్తించినారు.

ఈ మాయకు (1) ఆవరణశక్తి (2) విక్షేపశక్తి యని రెండు శక్తులు గలవు.

అస్యాజ్ఞానస్యావరణ విక్షేపనామక మస్తి శక్తిద్వయమ్। ఆవరణశక్తి స్తావ దల్పోఽపి మేఘోఽ నేకయోజనాయత మాదిత్యమండల మవలోకయితృనయనపథపిధాయకతయా యథాచ్ఛాదయతీవ తథాజ్ఞానమ్ పరిచ్ఛిన్న మసంసారిణ మవలోకయితృ బుద్ధిపిధాయకత యాచ్ఛాదయతీవ తాదృశం సామర్థ్యమ్। తదుక్తమ్–

శ్లో॥ ఘనచ్ఛన్నదృష్టి ర్ఘనచ్ఛన్నమర్కం – యథా మన్యతే నిష్ప్రభం చాతిమూఢః ।
తథా బద్ధవద్భాతి యో మూఢదృష్టేః– స నిత్యోపలబ్ధిస్వరూపోఽయమాత్మా॥ (హస్తా–10శ్లో)

అన యేవారణశక్త్యావచ్ఛిన్న స్యాత్మనః కర్తృత్వ – భోక్తృత్వ – సుఖ – దుఃఖమోహాత్మక తుచ్ఛసంసారభావనాపి సంభావ్యతే యథా స్వాజ్ఞానేనావృతాయాం రజ్జ్వాం సర్పసంభావనా। విక్షేపశక్తిస్తు యథా రజ్జ్వజ్ఞానం స్వావృతరజ్జౌ స్వశక్త్యా సర్పాదిక ముద్భావయత్యేవ మజ్ఞానమపి స్వావృతాత్మని విక్షేపశక్త్యాఽఽకాశాది ప్రపంచ ముద్భావయతి తాదృశం సామర్థ్యమ్। తదుక్తం – 'విక్షేపశక్తి ర్లింగాది బ్రహ్మాండాంతం జగ త్సృజేత్' –ఇతి

మేఘము చిన్న దైనను ననేక యోజన విస్తీర్ణమైన సూర్యమండలమున కడ్డముగా వచ్చి చూచు వారి కంటి మార్గమును గప్పిపుచ్చి యెట్లు సూర్యమండలము నాచ్ఛాదించుచున్నదో యట్లే యజ్ఞానము కూడ నుపాధిపరిచ్ఛిన్నుఁడై వాస్తవముగా సంసారి కాని జీవుని బుద్ధి కవరోధమైనట్లుండి సంసారిగాఁ జేయుచున్నది. ఇది యావరణశక్తి యొక్క సామర్థ్యము.

ఈ విషయమునే శ్రీహస్తామలకాచార్యు లిట్లు చెప్పినారు.–

'మేఘముచేఁ గప్పఁబడిన దృష్టి గలవాఁడు సూర్యుని మేఘముచేఁ 'గప్పఁబడిన వానిగాఁ గాంతి లేని వానిగా మూఢుఁ డెట్లు భావించుచున్నాఁడో యట్లే మూఢదృష్టి గలవాఁడు తాను సంసారములో బద్ధుఁడ నని తలంచుచున్నాఁడు. అట్టి నిత్యోపలబ్ధిస్వరూపుఁడగు నాత్మనే నేను'.

ఈ యావరణశక్తిచే నావరింపఁబడిన యాత్మకుఁ గూడఁ గర్తృత్వము, భోక్తృత్వము, సుఖము, దుఃఖము, మోహము గల తుచ్ఛసంసారభావన కలుగుచున్నది. తన యజ్ఞానముచేఁ ద్రాటిని జూచి పామని భ్రాంతి పడినట్లు జీవుని సంసారదశ కావరణశక్తి కారణ మగుచున్నది. చీఁకటిలోఁ ద్రాటిని జూచి పామని భ్రాంతి పడుచున్నాము. ఇక్కడ రజ్జ్వజ్ఞానము మనచే నావరింపఁబడిన రజ్జువు (త్రాడు) నందుఁ దన శక్తిచేఁ బాము మొదలగు వాని నెట్లుద్భావింపఁ

జేయుచున్నదో యట్లే యా యజ్ఞానము కూడఁ దనచే నావరింపఁబడిన యాత్మ యందాకాశాది ప్రపంచము నుద్భావింపఁజేయుచున్నది. ఇది విక్షేపశక్తి సామర్థ్యము. ఈ విక్షేపశక్తియే సూక్ష్మశరీరము నుండి బ్రహ్మాండము వఱకుఁ గల జగత్తును సృష్టించుచున్న దని చెప్పఁబడినది" – అని సదానందుని వేదాంతసారము.

అనఁగా మాయయే సమస్త జగత్తు నావరించి యున్నది. మాయచే నావరింపఁబడి యున్న వాఁడు పరమాత్మ. అవిద్యచే నావరింపఁబడి యున్న వాఁడు జీవాత్మ. పరమాత్మ జీవునకుఁ గనఁబడ కుండుటకు మాయ యడ్డు వచ్చుచున్నది. జీవుఁడు పరమాత్మను జూడ లేకుండుట కవిద్య యడ్డు వచ్చుచున్నది.

'యా మా సా మాయా' – ఏది లేదో యది మాయ. 'యా న విద్యతే సా అవిద్యా' – "ఏది యుండుట లేదో యది యవిద్య" – అను వ్యుత్పత్తులచే మాయయే యవిద్య యగుచున్నది.

"యేయం శ్రుతిస్మృతీతిహాసపురాణేషు – నామరూపమ్ – అవ్యాకృతమ్ – అవిద్యా – మాయా – ప్రకృతిః – అగ్రహణమ్ – అవ్యక్తమ్ – తమః – కారణమ్ – లయః – శక్తిః – మహాసుప్తిః – నిద్రా – అక్షరమ్ – ఆకాశమ్ – ఇతిచ తత్రతత్ర బహుధా గీయతే॥"

(1) నామరూపము (2) అవ్యాకృతము (3) అవిద్య (4) మాయ (5) ప్రకృతి (6) అగ్రహణము (7) అవ్యక్తము (8) తమస్సు (9) కారణము (10) లయము (11) శక్తి (12) మహాసుప్తి (13) నిద్ర (14) అక్షరము (15) ఆకాశము మొదలగునవి పర్యాయపదము లని శ్రీపద్మపాదాచార్యుల పంచపాదిక. శ్రీశంకరభగవత్పాదులు ప్రతిష్ఠించిన యద్వైతవేదాంత మంతయు నీమాయావాదముపై నాధారపడి యున్నది. శ్రీగౌడపాదాచార్యుల మాండూక్యకారిక, శ్రీశంకర భగవత్పాదుల ప్రస్థానత్రయభాష్యములు మొదలుకొని నేఁటి దాఁకఁ గల వేదాంతగ్రంథజాల వాఙ్మయ మంతయు నీమాయాస్వరూపమును వివరించుటకే సతమత మగుచున్నది.

ఈ మాయను గుఱించి తేలికభాషలో సూటిగాఁ జెప్పిన వాఁడు వేమన యోగి.

ఆ.వె. సతులు సుతులు మాయ సంసారములు మాయ
తనను దాను నమ్మ కొనుట మాయ
తెలియనీదు మాయ దీనిల్లు పాడాయె
విశ్వదాభిరామ! వినుర! వేమ!

***2) ఉరుగాయుఁడు :***

ఉరుగాయ = పురుష్టుత – అని వ్యాఖ్యానము

ఎక్కువ మందిచే స్తుతింపఁబడు వాఁడా! యని యర్థము.

ఉరుగాయః :- ఉరుభిః శ్రేష్ఠైః గీయతే గమ్యతే వా।
'గై-గానే; గతౌ వా' - కర్మణి ఘఞ్ పరమేశ్వరే వాసుదేవే। - అని వాచస్పత్యము.

శ్రేష్ఠులచే గానము చేయఁబడువాఁడు. లేక యందఱకు గమ్యమైన వాఁడు. పరమేశ్వరుఁడగు వాసుదేవుఁడు.

సూ॥ ప్రవిష్ణవే శూషమేతు మన్మగిరిక్షిత ఉరుగాయాయ వృష్ణే ।
(ఋక్-1-21-154-3) ఋగ్వేదము.
ఉరుగాయాయ - బహుభిః గీయమానాయ - సాయణభాష్యము.

సూ॥ యః పార్థివాని త్రిభి రిద్విగామభి రురుక్రమిష్టోరుగాయాయ జేవసే ।
(ఋక్-1-21-155-4) ఋగ్వేదము.
ఉరుగాయాయ - ఉరు గాతవ్యాయ - సాయణభాష్యము.

సూ॥ త్రీణ్యేక ఉరుగాయో విచక్రమే యత్ర దేవాసో మదంతి ।
(ఋక్-8-29-7) - ఋగ్వేదము.
ఉరుగాయః - ఉరుభిః బహుభిః గాతవ్యః (గంతవ్యః) యద్వా బహుషు దేశేషు గంతా బహుకీర్తిర్వా - సాయణభాష్యము.

మం॥స్తోమ మహ దురుగాయమ్ ప్రతిష్ఠా దృష్ట్వా । (కఠ-1-2-11)
ఉరుగాయమ్ - విస్తీర్ణాం గతిమ్ - శ్రీశంకరభాష్యము.

***3) అవివేకము :***

వివేకము = వేఱుచేయు జ్ఞానము. అవివేకము = అజ్ఞానము.

కం॥ చదువనివాఁడజ్ఞుండగుఁ
జదివిన సదసద్వివేక చతురతగల్గున్ (భాగ-7స్క-130) సత్ + అసత్ + వివేకము - మంచిచెడ్డలను వేఱు చేయు జ్ఞానము. సత్పదార్థము బ్రహ్మము. అసత్పదార్థము జగత్తు - అని యర్థాంతరము.

"అన్యోన్యస్మిన్ అన్యోన్యాత్మకతామ్ అన్యోన్యధర్మాం శ్చాధ్యస్య ఇతరేతరావివేకేన, అత్యంతవివిక్తయోః ధర్మధర్మిణోః మిథ్యాజ్ఞాననిమిత్తః సత్యానృతే మిథునీకృత్య 'అహ మిదమ్' 'మమేదమ్' ఇతి నైసర్గికోఽయం లోకవ్యవహారః"

మిథ్యాజ్ఞానముతో సత్యమును నసత్యమును మిళితముచేసి లోకధర్మముల నాత్మ యందు,

నాత్మధర్మములను లోకము నందు నారోపించి 'యిది నేను' – 'ఇది నాది' యని లోకములో సహజముగా నున్న వ్యవహారమే యవివేకము.

'అధ్యాసో'నా మాతస్మిం స్తద్బుద్ధి రిత్యవోచామ। తత్ర పుత్రభార్యాదిషు వికలేషు సకలేషు వాహమేవ వికలః సకలోవేతి బాహ్యధర్మానాత్మన్యధ్యస్యతి'

అది కాని దాని నది యని భావించుట 'యధ్యాస' మని చెప్పితిమి. అదెట్లనిన – పుత్రుఁడు కాని, భార్య కాని వికలత్వము నొందినను, సకలత్వము నొందినను (లోపము కల్గియున్నను, లోపము లేక యున్నను) నేనే వికలుఁడ నైతిని, నేనే సకలుఁడ నైతి నని వారి ధర్మములను దన యం దారోపించుకొనుట యధ్యాసము.

'తమేత మేవంలక్షణ మధ్యాసమ్ పండితా అవిద్యేతి మన్యంతే
తద్వివేకేన చ వస్తుస్వరూపావధారణం విద్యా మాహుః ।'

ఇట్టి లక్షణములు గల యధ్యాసమును పండితు లవిద్య యని తలంచుచున్నారు. వివేకముతో నున్న వస్తువు నాస్వరూపముతో గ్రహించుట విద్య (జ్ఞానము) యని చెప్పుచున్నారు – అని శంకరసూత్రభాష్యము. అనాత్మల నుండి యాత్మను వేఱుచేసి యాత్మ నాత్మగా గ్రహించుట వివేకము. ఆత్మ కాని దాని నాత్మగా గ్రహించుట యవివేకము. బ్రహ్మ మొక్కటి మాత్రమే నిత్య మైనది. తక్కిన దంతయు ననిత్యమని గ్రహించుట నిత్యానిత్యవస్తువివేకము.

నే నవివేకమునకు నిధి నగుటచే మమకారముతో నీజాయా – తనూజ – ధన – కాయాదులయందు దోషముల నెఱుఁగలేక పోవుచున్నాను. అందువల్లనే యాయామిని యగు మాయ నన్నాయాసపెట్టుచున్న దని కవి చెప్పినాఁడు.

***4) ఏషణాత్రయము:***

ఏషణ = కోరిక. (1) ధనైషణ (2) దారైషణ (3) పుత్రైషణ – ఏషణాత్రయము. (1) ధనము సంపాదింప వలె నని (2) భార్యను బొందవలె నని (3) పుత్రులను గనవలె నని మూఁడు విధములగు కోరిక లుండుట యేషణా త్రయము.

తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయశ్చ విత్తైషణాయాశ్చ
లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ బిక్షాచర్యం చరంతి ॥ (శత–14–6–4–1)

అని శతపథ బ్రాహ్మణము.

ఆత్మను దెలిసికొని బ్రాహ్మణు లేషణాత్రయమును విడిచిపెట్టి సన్న్యసించుచున్నా రని శ్రుతి చెప్పుచున్నది.

పుత్త్రైషణా – పుత్త్రోత్పత్తి ముద్దిశ్య దారసంగ్రహేచ్ఛాలక్షణా ।
కొడుకులను గనుటకై భార్యను బొందవలె ననెడి కోరిక దారైషణ.

శ్లో॥ న కశ్చి దన్యః సంసార ఉక్తా దస్త్యేషణాత్రయాత్. (పంచ– )

ఈ యేషణాత్రయము కంటె వేఱే సంసారము లేదని వేదాంత పంచదశి యుపదేశించుచున్నది.

***5) మాయానివాసుఁడు :***

మాయ యీశ్వరుని గూడ నావరించియుండును. మాయ యందు నివసించువాఁడు మాయానివాసుఁడు – కూటస్థుఁడు – పరమాత్మ.

శ్లో॥ కూటస్థ మచలం ధ్రువమ్. (భ.గీ–12–3) అని భగవద్గీత.

కూటస్థం దృశ్యమాన గుణమ్ అంతర్దోషం వస్తు కూటమ్। కూటరూపం కూటసాక్ష్య మిత్యాదౌ కూటశబ్దః ప్రసిద్ధో లోకే। తథా చావిద్యాద్యనేక సంసారబీజ మంతర్దోషవ న్మాయాకృతాది శబ్ద వాచ్యతయా 'మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్' (శ్వేతా–4–10); మమ మాయా దురత్యయా (భ.గీ–7–14) ఇత్యాతౌ ప్రసిద్ధం యత్ తత్ కూటమ్। తస్మిన్ కూటేస్థితం కూటస్థం తదధ్యక్షతయా అథవా రాశి రివ స్థితం కూటస్థమ్ – అని శంకర భాష్యము.

లోపల దోషము గల వస్తువు కూటము. 'కూటరూపము – కూటసాక్ష్యము' మొదలగు శబ్దములు లోకములోఁ బ్రసిద్ధములు. అవిద్య మొదలగు ననేకసంసారబీజము లంతర్దోషముగాఁ గలది మాయ. కూట మనఁగా మాయ. అధ్యక్షుఁడుగా మాయ యందుండు వాఁడు కూటస్థుఁడు.

***6) భగవంతుడు :***

భగవాన్ భగహాఽఽనందీ – విష్ణుసహస్రనామస్తోత్రము.

శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః ।
జ్ఞానవైరాగ్యయో శ్చైవ షణ్ణామ్ భగ ఇతీరణా ॥ (విష్ణు–6–5–74)
సోఽ స్యాస్తీతి భగవాన్।

శ్లో॥ ఉత్పత్తిమ్ ప్రలయం చైవ భూతానా మాగతిం గతిమ్ ।
వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవా నితి ॥ (విష్ణు–6–5–78)

(1) సమగ్ర మైన యైశ్వర్యము (2) ధర్మము (3) కీర్తి (4) శ్రీ (5) జ్ఞానము (6) వైరాగ్యము – ఈ యాఱింటికి భగ మని పేరు. ఇవి కలవాఁడు భగవంతుఁడు.

(1) జగత్తు యొక్క యుత్పత్తి (పుట్టుక) (2) ప్రలయము (3) పంచమహాభూతముల యొక్క రాక (4) పోక (5) విద్య (జ్ఞానము) (6) అవిద్య (మాయ - అజ్ఞానము) - ఈ యాఱింటిని గూర్చి తెలిసిన వాఁడు భగవంతుఁడు - అని విష్ణుపురాణోదాహరణపూర్వకముగా శ్రీశంకర భాష్యము.

శ్రీకృష్ణుఁడే సాక్షాద్భగవంతుఁడు

'కృష్ణస్తు భగవాన్ స్వయమ్' - అని శ్రీమద్భాగవతము.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే ॥ (భ.గీ. -7-14)

దేవునకు సంబంధించిన, సత్త్వ - రజస్ - తమో గుణములతో నిండిన యీ నా యొక్క మాయ యతిక్రమించుటకు శక్యము కానిది. నన్నే యెవరు పొందుచున్నారో - ప్రపత్తితోఁ గొల్చుచున్నారో వారీ మాయ నుండి తరింతురు - అని శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుఁ డుపదేశించుటచే నిచ్చటఁ గవి - ఆయామిని యగు మాయను దరించుటకై శ్రీకృష్ణపరమాత్మనే శరణు వేఁడుకొనినాఁడు. ౧౬

## ౧౭. కామినీ గర్హణము - మహేశసేవనము

**అవతారిక :** స్త్రీల వలలోఁ బడి మోసపోకుము. శివునే సేవింపు మని యుపదేశించుచున్నాఁడు.

**శ్లో॥ హారం దదాసి కుచ-భారం జిఘృక్షసి చ-సారంగచంచలదృశః**
**సా రంతు మిచ్ఛతి హి-జారం నిషేవ్య తవ-కా రంజనేహ ఘటతామ్ ।**
**స్మారం విహాయ మద-మారంభరమ్య మను-వారమ్ భజ! శ్రుతిగిరాం**
**సారమ్ మహేశ మవి-కారం జనుర్విలయ-పారమ్ ప్రయాస్యసి సఖే !** ౧౭

**వ్యాఖ్య :** సఖే = ఓ మిత్రమా!; సారంగచంచలదృశః = లేఁడి చూపుల వలెఁ జంచల మైన చూపులు గల స్త్రీ యొక్క; కుచభారమ్ = బరువైన చన్నులను; జిఘృక్షసి = పట్టుకొనవలె నని కోరుకొనుచున్నావు. అందు వల్లనే యామెకు; హారమ్ = ముత్యాల దండను; దదాసి = ఇచ్చుచున్నావు; సా = నీ విచ్చిన హారముతోఁ బ్రకాశించుచున్న కుచభారము గల యా కులుకు లాఁడి; జారమ్ = ఱంకుమగని; నిషేవ్య = బాగుగా సేవించి; రంతుమ్ = రమించుటకు; ఇచ్ఛతి = కోరుచున్నది. హి = నిశ్చయము. దీనివలన; తవ = నీకు; కా రంజనా = ఏయనురాగము; ఘటతామ్ = కలుగుచున్నది?. కాఁబట్టి; ఆరంభరమ్యమ్ = మొదట రమణీయముగా నుండి చివర కేవగింపు కల్గించునదియగు; స్మారమ్ = మన్మథ సంబంధ మైన, 'కందర్పో దర్పకోఽ నంగః కామః పంచశరః స్మరః' - అని యమరము. మదమ్ =

మత్తును; విహాయ = విడిచి పెట్టి; శ్రుతిగిరామ్ = వేదవాక్కులకు; 'వేదే శ్రవసి చ శ్రుతిః' 'గీర్వా గ్వాణీ సరస్వతీ' – అని యుభయత్ర యమరము. సారమ్ = సారమైన వానిని; అవికారమ్ = ఏ వికారములు (మార్పులు) లేని వానిని; మహేశమ్ = పరమశివుని; అనువారమ్ = మాటిమాటికి; భజ = సేవింపుము, జనుః + విలయ + పారమ్ = జనన – మరణముల నుండి మోక్షమును; ప్రయాస్యసి = పొందుదువు.

**తాత్పర్యము :** నీ వొక లేఁడి చూపులు గల చంచలాక్షినిఁ గామించి యామె స్తనభారమును గ్రహించుటకై ముత్యాలహారము నిచ్చుచున్నావు. ఆ గుబ్బలాఁడి నీవిచ్చిన ముత్యాలదండను వక్షః స్థలముపై ధరించి రండయై మఱియొక మిండని సేవించి కులుక వలెనని కోరుకొనుచున్నది. నీవు ప్రేమించిన యున్నతస్తని మఱొక ఱంకుమగనిఁ గామించుచున్నది. ఆమె కెన్ని సొమ్ములు పెట్టినను నీ యందేమి యనురాగము గలదు? ఆమె వలన నీకేమి సౌఖ్యము గలదు?. కాఁబట్టి ప్రారంభములో రమ్యము గా నుండి చివర కసహ్యమైన మన్మథమద వికారమును విడిచిపెట్టి వేదవచనములకు సారమైన వానిని, మూఁడు కాలములందు నేవికారములు లేని వానిని శ్రీమహేశ్వరునే తడవ తడవకు భజింపుము. నీకుఁ జావు పుట్టుకలు లేని మోక్షము లభింపఁ గల దని భావము. ౧౭

## ౧౮. కామినీగర్హణము – శివభజనము

**అవతారిక :** కామినీకామమును విడిచిపెట్టి శివునే సేవింపు మని మఱల మఱల బోధించుచున్నాఁడు.

**శ్లో॥ నీలాఽలకానయన–లీలావిమోహమయ–కీలాలరాశిజఠరే**
**వేలాఽతిలంఘ మను–వేలాఽవమజ్జి రిహ–తే లాఘవాయ నహి కిమ్? ।**
**కో లాభ? ఏష ఇతి–కోలాయితో జయసి–హాలాసమస్థిత వయః**
**కాలాఽహితం శమిత–హాలాహలం సతత–మాలాన యాత్మమనసా ॥** ౧౮

**వ్యాఖ్య :** నీల + అలకా = నల్లని ముంగురులు గల కాంత యొక్క; నయనలీలా = కన్నుల యందలి క్రేఁగంటి చూపుల విలాసము యొక్క; విమోహమయ = మిక్కిలి మోహముతో నిండిన; కీలాలరాశి = సంభోగశృంగార మను రససముద్రము యొక్క; జఠరే = కడుపులో; వేలా + అతిలంఘమ్ = ఎల్లల నతిక్రమించి; అనువేలమ్ = వేళ తప్పక మాటిమాటికి; అవమజ్జిః = మునుఁగుట; తే = నీకు; ఇహ = ఇక్కడ; లాఘవాయ = లఘుత్వమునకు – తేలికతనమునకు; న హి కిమ్ = కాదా యేమి? ఏష = ఇది; కః + లాభ + ఇతి – కోలాభ ఇతి = ఏమి లాభ మని; దీని వలన నేమియు లాభము లే దనిభావము. హాలా = కల్లుతో; సమ = సమానముగా; స్థిత = ఉన్న; వయః = వయస్సుతో; కోలాయితః = పంది వలె

నాచరించువాఁడవై; జయసి = ఎక్కువగా వర్తించుచున్నావు. నీవు నరసూకరము కావలదు. కాల+ అహితమ్ = యమునకు శత్రువైన వానిని; మృత్యుంజయుని; శమితహాలాహలమ్ = కాలకూటవిషమును శమింపఁ జేసిన వానిని; శ్రీశివుని; సతతమ్ = ఎల్లప్పుడు; ఆత్మమనసా = నీ మనస్సుచే; ఆలానయ = బంధింపుము. వశము చేసికొనుము.

**తాత్పర్యము :** నల్లని చూర్ణకుంతలములు గల కామిని యొక్క కన్నుల యందలి వాలు చూపుల విలాసమే మోహముతో నిండిన సముద్రము వంటిది. ఆ సంభోగ శృంగార సముద్రగర్భములోఁ బడి యెల్లలు తెలియకుండ నెల్లప్పుడు మాటిమాటికి మునిఁగితేలుచున్నావు. దీని వలన లోకుల కంటికి మిక్కిలి తేలిక యగు చున్నావు. దీని వలన నేమి లాభ మున్నది? వయస్సు కల్లువలె మత్తెక్కించునది. యౌవనము బలిసిన పందివలె నటు నిటు పరుగులెత్తును. ఇదియే గొప్పజీవిత మని నీవు భావించుచున్నావు. ఇది సరిగాదు. నీవీ నితంబినీ సంభోగకేళు లను విడిచిపెట్టి, యముని జయించిన మృత్యుంజయుని నీ మనస్సులో బంధింపుము. నిత్యము సేవింపుము. శివసాయుజ్యము నొందెద వని భావము.

ఈ శ్లోకము కాళిదాసు దేవీస్తుతిలోని -

శ్లో॥ బాలామృతాంశునిభ-ఫాలా మనాగరుణ-చేలా నితంబఫలకే
కోలాహలక్షపిత-కాలామరాకుశల-కీలాలశోషణరతా ।
స్థూలా కుచే జలద-నీలా కచే కలిత-లీలా కదంబవిపినే
శూలాయుధప్రణతి-శీలా విభాతు హృది- శైలాధిరాజతనయా ॥

అను శ్లోకపద్ధతి ననుసరించినది. ౧౭

## ౧౮. కలిదూషణము - వాసుదేవభజనము

**అవతారిక :** ఈ కలియుగము దావానలము వంటిది. ఓ వాసుదేవా! నీవే నన్ను రక్షింపుమని వేఁడుకొనుచున్నాఁడు.

**శ్లో॥ దావాఽనలార్చి రివ-తావా నయం తపతి-హా! వామ్యకృత్ కలి రహో!**
**కోవాఽ పర స్త్వదిహ-భో వాసుదేవ! మమ-యో వారయేత త మిమమ్ ।**
**సేవా విధాన భృశ-హేవాకసిద్ధముని-దేవాఽధునా చరణయో**
**ర్భావాఽఽనతాయ శిశు-భావాఽఽశ్రితాయ విత-రాఽఽవాసతాం నిజముదామ్॥ ౧౮**

**వ్యాఖ్య :** తావాన్ = ఎక్కువ పరిమాణము గల; వామ్యకృత్ = కుటిలత్వమును గల్గఁజేయు; అయమ్ = ఈ; కలిః = కలికాలము; హా! = అయ్యో!; దావ + అనల + అర్చిః + ఇవ =

అడవిలోఁ బుట్టిన కారుచిచ్చు మంటల వలె; తపతి = కాల్చుచున్నది. అహో = ఆశ్చర్యము. భో వాసుదేవ = ఓ శ్రీకృష్ణా!; ఇహ = ఈ లోకములో; మమ = నాకు; త్వత్ + అపరః = నీ కంటె నన్యుఁడు; యః + కః + వా = మఱొకఁ డెవ్వఁడు; తమ్ + ఇమమ్ = ప్రసిద్ధుఁ డైన యీ కలిపురుషుని – కలిబాధను; వారయేత = నివారింపఁ గలఁడు?. సేవావిధాన = సేవించు పద్ధతి యందు; భృశ = మిక్కిలి; హేవాక = స్పర్ధగలిగిన – అత్యంతాసక్తిగల; సిద్ధ = కపిలాదు లగు సిద్ధులు; ముని = నారదాది మహర్షులు, దేవ = ఇంద్రాది దేవతలు గలవాఁడా!; అధునా = ఇప్పుడు; చరణయోః = నీ పాదము లందు; భావ + ఆనతాయ = భక్తిభావముతో బాగుగా వంగి నమస్కరించువానికి; శిశుభావ + ఆశ్రితాయ = చంటి పిల్లవాని లక్షణముల నాశ్రయించిన నాకు; నిజముదామ్ = నీ స్వస్వరూపానందముల; ఆవాసతామ్ = నివాసస్థానమును; వితర = ఇమ్ము!

***తాత్పర్యము :*** ఈ కలికాల మెక్కువ పరిమాణముతో వక్రమార్గములను గల్గఁజేయుచుఁ గార్చిచ్చు మంటల వలెఁ దాపముతో మండించుచున్నది. ఆశ్చర్యము! అయ్యో! శ్రీకృష్ణా! ఈ లోకములో నీకలిబాధల నుండి న న్నుద్ధరించుటకు నీ కంటె వేఱెవ్వఁడు కలఁడు? కపిలుఁడు మొదలగు సిద్ధులు, నారదుఁడు మొదలగు మహర్షులు, ఇంద్రుఁడు మొదలగు దేవతలు నేను ముం దన్నచో నేను ముం దని యహమహమికతో మిక్కిలి యుత్కంఠతో నుత్కటాసక్తితో నెక్కువస్పర్ధతో స్వచ్ఛందముగా నిన్ను సేవించుచున్నారు. అట్టి నీ యడుగులను భక్తిభావముతో వంగి నమస్కరించుచుంటిని. నేనేమియుఁ దెలియని పిల్ల వాఁడను. నీ స్వరూపానందములో నివసించుటకు నాకు స్థాన మిమ్ము!

***విశేషములు :***

***1. అగ్ని :*** అగ్ని మూఁడు విధములు

(1) అడవిలోఁ బుట్టు నగ్ని దావాగ్ని (2) సముద్రములోఁ బుట్టు నగ్ని బడబాగ్ని (3) మన కడుపులో నున్న యగ్ని జఠరాగ్ని.

***2. హేవాకము :*** ఈ శబ్దము సంస్కృత నిఘంటువులలో లేదు. ప్రాచీనసంస్కృత కవులు ప్రయోగింప లేదు.

హేవాకాః = స్పర్ధాయుక్తాః – అని కృష్ణపండితుని దర్పణవ్యాఖ్య. బిల్హణుఁడు మొదలగు మధ్యకాలసంస్కృతకవులు, శ్రీనాథుఁడు మొదలగు తెలుఁగు కవులు ప్రయోగించినారు. శబ్దరత్నాకర – సూర్యరాయాది నిఘంటువులు గైకొన్నవి.

హేవాకము. సం. వి. అ. పుం. ప్రౌఢిమ, తెలివి యని శబ్దరత్నాకరము.

హేవాకము. సం. వి. అ. పుం. అత్యంతాసక్తి. అని సూర్యరాయనిఘంటువు.

ఇది పారసీకపదమో, అరబ్బీపదమో యైయుండు నని 'ఆప్టే' నిఘంటువు.

కం॥ స్థావర రాజ తనూభవ
యా వేళన డాయ వచ్చె నభవుని సేవా
హేవాకప్రౌఢిని వన
దేవత లెంతయును నభిరతిం దనుఁ గొలువన్. (హర–3–67)

అని శ్రీనాథుని హరవిలాసము.

ఇక్కడ 'హేవాకప్రౌఢి – తెలివిడి యందలి గొప్పతనము' – అని శ్రీ బులుసు వేంకట రమణయ్య గారి లఘుటీక.

కం॥ రేవాతరంగశీకర
సేవాహేవాకపాకశిశిరమరుత్ప్ర
స్తావపరికంప్యమానజ
టావలి యగు చతఁడు వింధ్య మల్లనఁజేరెన్. (కాశీ–1–88)

అని శ్రీనాథుని కాశీఖండము.

ఇక్కడ – "సేవా = సేవ యందలి; హేవాక = ప్రౌఢి యొక్క; పాక = పరిపాకము చేత" నని శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ గారి వ్యాఖ్య. ఈ రెండు వ్యాఖ్యలు శబ్దరత్నాకరము ననుసరించినవి. శబ్దరత్నాకరము చెప్పినట్లు 'హేవాక' శబ్దమునకుఁ 'బ్రౌఢి' యను నర్థమున్నచో 'హేవాకప్రౌఢి' యని శ్రీనాథుఁడు ప్రయోగించి యుండఁడు. ఇది 'యగ్గి నిప్పు' వంటి దగును. కాఁబట్టి 'ఆసక్తి' యను సూర్యరాయనిఘంటువే సరియైనది.

హేవాకః. పుం.

యహ శబ్ద కదాచిత్ ఫారసీ యా అరబీ సే లియాగయా హై 'లటభ' శబ్ద కీ భాంతి ఇసకా ప్రయోగ భీ కల్హణ బిల్హణ ఆది పశ్చాద్వర్తీ సాహిత్యకారోం ద్వారా హీ హుఆ హై।
ఉత్కట ఇచ్ఛా; తీవ్రస్పృహా; ఉత్కంఠా.

శ్లో॥ అస్మిన్నాసీ త్తదను నిబిడాశ్లేషహేవాకలీలా ।
వేల్లద్బాహుక్వణితవలయా సంతతం రాజ్యలక్ష్మీః ॥ (విక్రమాంక–18–102)

అని వామనశివరామ ఆప్టే సంస్కృత – హిందీ కోశము.

దేవాదిభి స్సమయసేవాదరత్వరితహేవాకఘోషముఖరైః । (4-123)
అని శ్రీవేదాంతదేశికుల యాదవాభ్యుదయము.

హేవాకఘోషేణ - స్వచ్ఛందస్తుతిఘోషేణ ।
'హేవాకః - స్వాచ్ఛంద్యమ్' - ఇతి చక్రవర్తీ
అని శ్రీమదప్పయ్యదీక్షితుల వ్యాఖ్య. ౧౯.

## ౨౦. దేశాటనదూషణము - పార్వతీసేవనము

**అవతారిక :** ధనము నెక్కువగా నార్జింప వలె ననెడి కోరికతో వివిధ దూరదేశములలోఁ దిరుగుట వలనఁ బ్రయోజనము లేదు. శ్రీపార్వతీదేవినే సేవింపు మని యుపదేశించుచున్నాఁడు.

**శ్లో॥ ఆశాభరేణ నిఖి-లాఽఽశాసు ధావన మ-థాఽఽశాతకుంభగిరి వా**
**క్లేశాఽఽవహం వివిధ-దేశాఽటనం ద్రవిణ-లేశాయ నాఽపి వవృతే ।**
**ఆశాఽతిదా మవితు-మాశాస్వ పాణిధృత-పాశా మనేక జగతా**
**మీశా ముపాసితగి-రీశా మిహాఽంగ! దిగ-ధీశాఽర్చితాఽంఘ్రినలినామ్ ॥౨౦**

**వ్యాఖ్య :** ఆశాభరేణ = ఎక్కువగా ధనము సంపాదింప వలె ననెడి మిక్కుట మైన యాశతో; ఆశాతకుంభగిరి = బంగారముతో నిండిన మేరుగిరి పర్యంతము; 'స్వర్ణం సువర్ణం కనకం హిరణ్యం హేమ హాటకమ్ తపనీయం శాతకుంభమ్'; 'మేరు స్సుమేరు ర్హేమాద్రిః' - అని యుభయత్ర యమరము. నిఖిల + ఆశాసు + వా = అన్ని దిక్కుల యందుఁ గూడ; 'దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చ తాః' 'ఆశా తృష్ణాపి చాయతా' - అని యమరము. ధావనమ్ = పరుగెత్తుట; వివిధదేశ + అటనమ్ = అనేకదేశములందుఁ దిరుగుట; క్లేశ + ఆవహమ్ = కష్టములతోఁ గూడినది. ద్రవిణలేశాయ + అపి = కొంచెము డబ్బు కూడ; 'ద్రవ్యం విత్తం స్వాపతేయం రిక్థ మృక్థం ధనం వసు హిరణ్యం ద్రవిణమ్' - అని యమరము. న వవృతే = నిన్ను వరించుట లేదు. 'వృతు - వరణే' - దివాది ధాతువు. అంగ = ఓయీ!. ఆశా + అతి + దామ్ = నీ యాశకు మించిన కోరికలు తీర్చు దానిని; పాణిధృతపాశామ్ = చేతిలో ధరింపఁబడిన పాశము గల దానిని; అనేక జగతామ్ = సమస్తలోకములకు; ఈశామ్ = ఈశ్వరి యైన దానిని; ఉపాసితగిరీశామ్ = ఉపాసింపఁబడిన యీశ్వరుఁడు గల దానిని; 'గిరీశో గిరిశో మృడః' - అని యమరము. దిక్ + అధి + ఈశ = దిగధీశ = దిక్పాలకులచే; అర్చిత = పూజింపఁబడిన; అంఘ్రినలినామ్ = పాదపద్మములు గల దానిని - శ్రీపార్వతీదేవిని; ఇహ = ఇక్కడ; అవితుమ్ = రక్షించుటకు; ఆశాస్వ = ఉపాసింపుము.

**తాత్పర్యము :** ధనముపైఁ గల యధికాశతో నలుదిక్కులకుఁ బరువెత్తి వివిధదూరదేశములలోఁ

బర్యటించుచు ననేక కష్టము లనుభవించుచున్నావు. నీవు మేరుపర్వతము వీఁపెక్కి నను పిసరంత ధనలక్ష్మికూడ నిన్ను వరింపదు. ఇది వృథాశ్రమము. అందు వలన ధనచింత మాని నీ యాశల కిమ్మడిగా ముమ్మడిగాఁ గోర్కెలు తీర్చి ఫలమునిచ్చుదానిని; పాశమును హస్తములో ధరించిన దానిని, సకలలోకములకు మహారాజ్ఞి యైన దానిని, నిత్యము శివునుపాసించు దానిని, దిక్పాలకులచే సేవింపఁబడిన యడుగుఁదమ్ములు గల దానిని శ్రీలలితామాత నిప్పుడే యిక్కడే రక్షింపుమని యుపాసింపుము. ౨౦.

## 21. దేహానిత్యత్వము - పార్వతీసేవనము

***అవతారిక :*** ముసలితనము రోగములు వచ్చు నీదేహము శాశ్వతము గాదు. కాఁబట్టి మిగిలిన యాయువును దేవీపూజకై వినియోగింపు మని యుపదేశించుచున్నాఁడు-

**శ్లో॥ ఏషా జరా శిరసి-వేషాఽన్యభావకృ ద-శేషాఽఽమయైక వసతి**
**స్తోషాయ సౌమ్య! నహి-దోషాఽఽలయా భృశ మ-పోషాఽఽస్పదీకృతగుణా ।**
**శేషాయుషః కురు! వి-శేషాఽర్హ మేత దిహ-శేషాఽహిక్లప్తధనుషో**
**రోషాద్యపాస్య తను-శోషాఽఽవహం కలయ!-యోషా మనంగ జయినః ॥౨౧**

***వ్యాఖ్య :*** సౌమ్య = ఓ సౌమ్యుఁడా! వేష = నల్లని జుట్టు, నున్నని చర్మము మొదలగు సుందరరూపమును; అన్యథాకృత్ = తెల్లని జుట్టు, బోడి తల, ముడుతలు పడ్డ చర్మము మొదలగు నితరభావమును గల్గఁజేయునది; అశేష = సమస్త; ఆమయ = రోగములకు, ఏకవసతిః = ఒకేస్థానమైనది; 'రోగవ్యాధిగదామయాః' – అని యమరము. దోష + ఆలయా = అనేకదోషములకు నిలయమైనది; భృశమ్ = మిక్కిలి; అపోష + చిక్కిపోవుటకు, ఆస్పదీకృత = స్థానముగాఁ జేయఁబడిన; గుణా = గుణములు గలది – శరీరపుష్టి, జ్ఞాపకశక్తి మొదలగు గుణములను శోషింపఁజేయునది యగు; ఏషా = ఈ; జరా = ముసలితనము; శిరసి + తలపైకి వచ్చునదై; ఇది యుపలక్షణము. ముసలితనము సర్వావయవము లందు వ్యాపించునదై; తోషాయ నహి = నీకు సంతోషము కలిగింపదు. 'వ్యాఘ్రీవ తిష్ఠతి జరా' – ఎప్పుడు వీని పైకి దూఁకుదునా యని యీ ముసలితనము పులి వలెఁ బొంచి యుండు నని భర్తృహరి చెప్పినాఁడు. ఇహ = ఇక్కడ – ఈ సంసారములో; తను = దేహమును; శోష + ఆవహమ్ = ఎండింపఁజేయు; రోష + ఆది = కోపము మొదలగు వానిని; కామ – క్రోధ – లోభ – మోహ – మద – మాత్సర్యములును నరిషడ్వర్గమును; అపాస్య = విడిచిపెట్టి; ఏతత్ = ఈ; శేష + ఆయుషః = మిగిలిన యాయుస్సును; విశేష + అర్హమ్ = ఎక్కువ యోగ్యమైన దానిగాఁ జేయుము. శేష + అహి = శేషుఁడను పాముచే; క్లప్త = చేయఁబడిన; ధనుషః = విల్లు గల వాని యొక్క, ఆదిశేషుని వింటి నారిగాఁ జేసిన వాని యొక్క; త్రిపురాసురసంహారములో మేరుపర్వతము

విల్లైనది, వాసుకి వింటి నారి యైనాఁడు. ఇక్కడ శేష – వాసుకుల కభేదభావముతో శేషుఁ డని చెప్పఁబడినది. ధనుశ్శబ్దమునకు లక్షణచే వింటినారి యను నర్థమును గ్రహింపవలెను. అనంగజయినః = మన్మథుని జయించిన శివుని యొక్క; యోషామ్ = భార్య యగు పార్వతీదేవిని; 'స్త్రీ యోషి దబలా యోషా' – అని యమరము. కలయ = ఆశ్రయింపుము.

**తాత్పర్యము :** ముసలితనము నీ తలపైనెప్పుడు వాలుదునా యని పొంచియున్నది. ఇది యనేకదోషములకు నిలయము. ముసలితనము రాఁగానే దేహములో నెన్నియో మార్పులు వచ్చును. నల్లని జుట్టు తెల్లఁబడును. ఆ యున్న తెల్లజుట్టు కూడ రాలి పోయి బోడితల యగును. నున్నని చర్మము ముడుతలు పడును. అనేక రోగములు శరీరము నాక్రమించును. తనువు చిక్కి శల్య మగును. ఎముకలు పైకి వచ్చును. ఇంద్రియముల పటుత్వము తగ్గి చూపానదు. మాట వినఁబడదు. కాలుసేతు లాడవు. అన్నము రుచింపదు. తిన్నది యరుగదు. ఈ విధముగా ముదిమి వలన నవయవములకు శరీరమునకు నన్యథాభావము (వేఱొక రూపము) కలుగును. అప్పుడు వృద్ధుఁడ వైన నీవేమియుఁ జేయ లేవు. కాఁబట్టి సౌమ్యుఁడా! మిగిలిన యాయువును యోగ్యమైన దానిగా మలచుకొనుము, జీవిత మెండి పోవుటకు హేతువులైన (1) కామము (కోరిక); (2) క్రోధము (కోపము); (3) లోభము (పిసినిగొట్టుతనము); (4) మోహము (వస్తువులపైవలపు); (5) మదము (క్రొవ్వు – గర్వము); (6) మాత్సర్యము (ఈర్ష్య – ద్వేషము ) అను నరిషడ్వర్గమును (లోపలనున్న యార్గురు శత్రువులను) జయించి (విడిచిపెట్టి) పాము వింటినారి గాఁగల మన్మథజేతకు భార్యయైన శ్రీపార్వతీదేవిని సేవింపుము. వార్ధక్యములో నేబాధలు లేక సకలసౌఖ్యములు చివరకు మోక్షము పొందెద వని భావము. ౨౧

## ౨౨. సంసారదూషణము – శివభజనము

**అవతారిక :** ఈ సంసారము నిస్సార మైనది. కావున శివునే భజింపు మని బోధించుచున్నాఁడు. –

**శ్లో॥ సంసారధన్వభువి–కిం సార మామృశసి?–శంసాఽధునా శుభమతే!**
**త్వం సాధు సంతను హి–తం సాహసేన తు నృ–శంసాఽఽదృతేన కి మహో! ।**
**హంసాఽఽశయస్థ మతి–హంసాత్మభాస మథ–తం సామభిః పరిగృణన్**
**కంసారివంద్య మవ–తంసాయితేందు మిహ–సంసాధ యార్థమఖిలమ్ ॥**

౨౨

**వ్యాఖ్య :** సంసార = సంసార మనెడి; ధన్వభువి = మరు (నీళ్ళులేని) భూమిలో; 'సమానౌ మరు ధన్వానౌ' – అని యమరము. కిం సారమ్ = ఏమి సారమును; ఆమృశసి = ఆశించుచున్నావు?. ఏమైన సార మున్నచో; శంస = ప్రశంసింపుము. ఈ సంసారములో

నేసారము లే దని భావము. శుభమతే = మంచి బుద్ధి కలవాఁడా! అధునా = ఇప్పుడు; త్వమ్ = నీవు; సాధు = మంచిని; హితమ్ = ఇష్టమైనదానిని; సంతను = విస్తరింపుము. ఆత్మహిత మైన మంచికార్యములు చేయు మని భావము. నృశంస = దుర్మార్గులచే – పాపులచే; 'నృశంసో ఘాతుకః క్రూరః పాపః' – అని యమరము. ఆదృతేన = ఆదరింపఁబడిన – స్వీకరింపఁబడిన; సాహసేన = పరుల ధనమును దొంగలించుట, పరస్త్రీల నపహరించి పాడు చేయుట, పరులను హింసించుట మొదలగు సాహసకృత్యముల వలన; అహెూ కిమ్ = అయ్యో! ఏమికలదు? ఇట్టి దుర్మార్గపుఁబనుల వలన నన్నియుఁ గష్టములే కాని శుభములేమియు నుండవని భావము. కాఁబట్టి – అథ = తరువాత; హంస = హంస లను యోగుల యొక్క; 'యతిభేదే చ హంసః స్యాత్' – అని నిఘంటువు. ఆశయస్థమ్ = అభిప్రాయము నందు (మనస్సులో) నున్న వానిని; 'అభిప్రాయ శ్ఛంద ఆశయః' – అని యమరము. 'ఆశయౌ స్థానతాత్పర్యౌ' – అని నానార్థరత్నమాల. అతిహంస = సూర్యు నతిక్రమించిన; 'భాను ర్హంసః సహస్రాంశు స్తపన స్సవితా రవిః' – అని యమరము. ఆత్మభాసమ్ = స్వీయకాంతి గల వానిని; కంస + అరి + వంద్యమ్ = కంసునకు శత్రువైన శ్రీమహావిష్ణువుచే నమస్కరింపఁదగిన వానిని;'వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః' – అని యమరము. అవతంస + ఆయిత + ఇందుమ్ = శిరోభూషణముగాఁ జేయఁబడిన చంద్రుఁడు గల వానిని – చంద్రశేఖరుని; 'పుంస్యుత్తంసావతంసౌ ద్వౌ కర్ణపూరేఽపి శేఖరే'; 'హిమాంశు శ్చంద్రమా శ్చంద్ర ఇందుః కుముదబాంధవః' – అని యుభయత్ర యమరము. తమ్ = ప్రసిద్ధుఁడగు పరమశివుని; సామభిః = ప్రేమకీర్తనలతో లేక సామవేదమంత్రములతో; పరిగృణన్ = బాగుగాఁ గీర్తించి; ఇహ = ఈ లోకము నందే; అఖిలమ్ + అర్థమ్ = సమస్త పురుషార్థమును – ధర్మార్థకామమోక్షము లను చతుర్విధ పురుషార్థములను; సంసాధయ = బాగుగా సాధింపుము.

**తాత్పర్యము :** ఈ సంసారము నీరు లేని చవిటి నేల వంటిది. దీనిలో నేమి సార మున్న దని తలఁచుచున్నావు. సార మున్నచోఁ బ్రశంసింపుము. ఇది నిస్సారము. కాఁబట్టి నీవు మంచి పనులు చేయుము. పాపులమార్గము ననుసరింపకుము. హంసయోగుల హృదయము లందు నివసించు వానిని, సూర్యుని మించిన తేజస్సు గల వానిని, శ్రీమహావిష్ణువునకుఁ గూడఁ బూజ్యుఁడైన వానిని; చంద్రుఁడు శిరోఽలంకారముగాఁ గల వానిని శ్రీపరమశివుని సామవచనములచే స్తుతించి యీ లోకము నందే సమస్త పురుషార్థములను సంపాదింపుము.

***విశేషము :***

హంసాశయస్థుఁడు – ఇది చతుర్విధసన్న్యాసులకు నుపలక్షణము. సంన్యాసులు (1) కుటీచకుఁడు (2) బహూదకుఁడు (3) హంస (4) పరమహంస యని నాలుగు విధములుగా నుందురు.

శ్లో॥ చతుర్విధా భిక్షవ స్తే కుటీచకబహూదకౌ ।
హంసః పరమహంస శ్చ యోఽత్ర పశ్చాత్ స ఉత్తమః ॥ (భార - అను - 14 - )
అని మహా భారతము.

తీవ్రవైరాగ్యే సతి యాత్రాద్యశక్తౌ కుటీచకాధికారః। తచ్ఛక్తౌ
బహూదకాధికారః। తీవ్రవైరాగ్యే సతి హంససన్న్యాసాధికారః ।
ఏతే త్రయః సన్న్యాసాః। ఏతేషా మాచారాశ్చ స్మృతౌ ప్రసిద్ధాః।
తీవ్రతరవైరాగ్యే ముముక్షోః పరమహంససన్న్యాసాధికారః ॥
అని మహాదేవసరస్వతి తత్త్వానుసంధానము.

1. తీవ్రవైరాగ్యము గలిగి తీర్థయాత్రలు చేయు శక్తి లేక కుటి (గుడిసె) యందే యుండు సంన్యాసి కుటీచకుఁడు.

2. తీవ్రవైరాగ్యము కలిగి తీర్థయాత్రలు చేయుచుఁ బరివ్రాజకుఁ డగు సన్న్యాసి బహూదకుఁడు. శౌచమునకై యనేక పవిత్రోదకములలో మునుఁగు సన్న్యాసి బహూదకుఁడు.

3. తీవ్రతరవైరాగ్యము గలిగిన సన్న్యాసి హంస. హంస నీటి నుండి పాలను విడఁదీసి పాలను గ్రహించునట్లుగా జగత్తును వేఱుచేసి యాత్మ యందే రమించు వాఁడు హంస.

4. తీవ్రతమవైరాగ్యము గలిగి మోక్షమునం దుత్కటేచ్ఛ గలవాఁడు పరమహంస. ఇతఁడు నిరంతరము హంస (హంసః - సోఽహమ్) జపము చేయుచుండును.

సన్న్యాసి (1) శిఖను (2) యజ్ఞోపవీతమును (3) నిత్యకర్మమును గూడఁ ద్యజించును. కౌపీనమును (గోచి), దండమును మాత్రము ధరించును.

శ్లో॥ శిఖాం యజ్ఞోపవీతం చ నిత్యం కర్మ పరిత్యజేత్ । అని స్కందపురాణము.

విద్వత్సన్న్యాసి యగు పరమహంసకు దండధారణము కూడ నుండదు. వానికి జ్ఞానమే దండము.

'న దండం న శిఖాం న యజ్ఞోపవీతం నాచ్ఛాదనం న భైక్షం చరతి పరమహంసః' - అని మహోపనిషత్తు.

ప్రాచీనకాలములో శ్రీగౌడపాదులు, శ్రీగోవిందభగవత్పాదులు, శ్రీశంకరభగవత్పాదులు మున్నగు వారు పరమహంసపరివ్రాజకు లగు విద్వత్సన్న్యాసులు. అందువల్లనే - 'శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ గోవిందభగవత్పూజ్యపాదశిష్య శ్రీశంకరభగవతః కృతౌ' - అను ప్రస్థానత్రయభాష్యాంత గద్యములు సంగచ్ఛమానము లగుచున్నవి.

నవీనకాలములో భార్య యగు శ్రీ శారదాదేవినిఁ బరాశక్తిగా భావించి శిష్యుఁడగు శ్రీ వివేకానందస్వామికి భగవంతునిఁ జూపించి వలసినప్పుడు శ్రీకాళీమాతతోఁ గూడఁ బ్రత్యక్షముగా సంభాషించి తన యాచరణమే లోకమున కాదర్శము చేసిన యోగిపుంగవుఁడు శ్రీరామకృష్ణుఁడు పరమహంస.

ఈ చతుర్విధ సన్న్యాసుల హృదయములందు శివుఁడు కాఁపురముండు నని 'హంసాశయస్థ' వాక్యమున కర్థము. ౨౨

## ౨౩. గృహాదిమోహనింద - శివస్తుతి

***అవతారిక :*** గృహము, సంతానము, ధనము, దేహము మొదలగునవి యన్నియు మోహబంధములు. కావున శివునే భజింపుమని బోధించుచున్నాఁడు-

**శ్లో॥ గేహాఽఽత్మజద్రవిణ-దేహాఽఽదికం జనిత-మోహాఽనుబంధ మవితుమ్**
**భో హాని రాపి కియ-తీహాఽపి సుస్థితిమ-తీహా న తే నిజహితే ।**
**వాహాయితోక్ష భవ-దాహాఽపహం సలిల-వాహాఽఽభకంఠసుషమమ్**
**బాహాలసన్మృగ మ-నాహార్యసౌఖ్యకర-మాహాత్మ్య మాభజ! మహః ॥** ౨౩

***వ్యాఖ్య :*** భోః = ఓయి! గేహ = ఇల్లు; ఆత్మజ = కొడుకు; ద్రవిణ = డబ్బు; దేహ + ఆదికమ్ = శరీరము మొదలగున దంతయు; జనిత = పుట్టిన; మోహ + అనుబంధమ్ = మోహముతోఁ గూడినది. అజ్ఞానసంబంధ మైనది. దీనిని; అవితుమ్ = రక్షించుటకు; ఇహ + అపి = ఈ లోకములోఁ గూడ; కియతీ హానిః = ఎంత యెక్కువ యైన హాని; ఆపి = నీచేఁ బొందఁబడినది. ప్రాప్తించినది. ఎన్ని దుఃఖములు సహించి రక్షించుచున్నను వీనికి హానియే కల్గుచున్న దని భావము. అయినను; తే = నీకు; నిజహితే = నీ కిష్టమైన దాని యందు; ఈహా = కోరిక యున్నను; సుస్థితిమతీ = మంచి స్థితి గలది; న = కాదు. నీవెంత కోరికతో యత్నించినను జనన- మరణరూపములో నున్న యీదేహాదిసంసారబంధమునకు సుస్థిరత్వము లేదు. కాఁబట్టి; వాహాయిత = వాహనముగాఁ జేయఁబడిన; ఉక్ష= ఎద్దు గలది; భవ = సంసారము నందలి; దాహ = తాపమును; అపహమ్ = అపహరించునది - పోఁగొట్టునది; సలిలవాహ = నీటిని ధరించిన మేఘముతో; ఆభ = సమానమైన; కంఠసుషమమ్ = గళకాంతి గలది; బాహా = చేతిలో; లసత్ = ప్రకాశించుచున్న; మృగమ్ = లేఁడి గలది; అనాహార్య = మూఁడు కాలము లందు బాధింపఁబడని; సౌఖ్య = ఆనందమును; కర = కలుగఁజేయు; మాహాత్మ్యమ్ = గొప్పతనము కలది యగు; మహః = తేజస్సును; ఆభజ = బాగుగా సేవింపుము.

**తాత్పర్యము :** ఓయి! ఇండ్లు, కొడుకులు, డబ్బు, తనువు మొదలగు నీసంసార మంతయు మోహానుబంధము. అజ్ఞానబంధము వలనఁ గలిగినది. వీనిని రక్షింపవలె ననెడి కోరికతో నీ వెన్ని పాట్లు పడుచుంటివి. నీ వెంత రక్షించినను వీనికి హాని తప్పదు. కాఁబట్టి నందివాహనుని, సంసారతాపము నాశనము చేయు వానిని, నీలకంఠుని, మృగధరుని, నిత్యసౌఖ్యప్రదుఁ డగు వానిని శ్రీశివునే బాగుగా భజింపుము. ౨౩

## ౨౪. కాళీస్తుతి

**అవతారిక :** ఇప్పుడు గ్రంథమును ముగింపఁ బోవుచు శ్రీకాళీమాతను స్తుతించుచున్నాఁడు-

**శ్లో॥ వాలీయుత శ్రవణ-పాలీయుగా లలిత-చూలీవిరాజిబకులా**
**కేలీగతానుగమ-రాలీకులా మధుర-మాలీభి రాదృతకథా ।**
**నాలీకదృక్ కుసుమ-నాలీకపాణి రిహ-కాలీయశాసిసహజా**
**తాలీదలాభతను-మాలీ సదా భవతు-కాలీ శుభాయ మమ సా ॥** ౨౪

**వ్యాఖ్య :** వాలీ = కేశగుచ్ఛముతో - కొప్పుతో; యుత = కూడిన; శ్రవణపాలీయుగా = పెద్ద వగు రెండు చెవులు గలది. జాఱుకొప్పు చెవులపైఁ బడుచున్న దని భావము. లేక 'వబయో రభేదః' - అను వచనముచే; బాలీ = దుద్దులతో; బాళీలు - చెవిదుద్దు లని లోక వ్యవహారము, యుత = కూడిన; శ్రవణపాలీయుగా = కర్ణద్వయము గలది; లలిత = మృదువైన (లేక) అందమైన; చూలీ = చెవి మూల భాగము నందు; విరాజి = ప్రకాశించుచున్న; బకులా - వకులా = పొగడపువ్వు గలది. పొగడపువ్వును జెవిలో ధరించిన దని భావము. కేలీగత = క్రీడగా నడచు నప్పుడు; అనుగ = అనుగమించుచున్న - వెనుక వచ్చుచున్న; మరాలీకులా = ఆఁడుహంసల సమూహము గలది. పార్వతీదేవి నడకలు హంసనడకల వలె నుండుటచే నాఁడుహంస లామెను వెంబడించుచున్న వని భావము. మధురమ్ = తియ్యఁగా; ఆలీభిః = చెలికత్తెలచే; ఆదృత = ఆదరింపఁబడిన; కథా = కథలు గలది. ఆదరముతో వినుచున్న చెలికత్తెలకుఁదియ్యని కథలు చెప్పుచున్న దని భావము. నాలీకదృక్ = పద్మముల వంటి కన్నులు గలది. 'నాలీకః శరశల్యాంగే ష్వబ్జఖండే నపుంసకమ్' - అని మేదినీకోశము. లేక - న + అలీక + దృక్ = అసత్యములు గాని చూపులు గలది. పార్వతీ దేవి చూపులు సత్య మైనవి. ఆమెకటాక్ష మించుక మనపైఁ బ్రసరించినచో మన కోరిక లన్నియు నిక్కముగా నెఱవేఱు నని భావము. లేక - న + అలీక + దృక్ = అప్రియములు కాని - ప్రియ మైన చూపులు గలది. ' అళీకం త్వప్రియేఽ నృతే' - అని యమరము. అమోఘదర్శన యని భావము. కుసుమ + నాలీకపాణిః = ఇతరపుష్పముల తోపాటు పద్మము కూడ హస్తము నందుఁ గలది. పద్మపాణి యని యర్థము. కాలీయశాసి = కాళియుఁ డను సర్పమును శాసించిన శ్రీకృష్ణునకు; సహజా = తోడఁబుట్టు వైనది; తాలీదల + ఆభ = తాటాకుతో

సమానమైన; తనుమాలీ = దేహకాంతి గలది. నల్లని రంగు గలది. శ్యామల యగు; సా కాలీ = ప్రసిద్ధురాలగు కాళికాదేవి; ఇహ = ఇక్కడ; సదా = ఎల్లప్పుడు; మమ = నాకు; శుభాయ = శుభము కొఱకు; భవతు = అగుఁగాక! ఆ కాళీదేవి నాకు శుభములు గల్గించుఁగాక! యని భావము.

**తాత్పర్యము :** పెద్ద జాఱుకొప్పుచేఁ గప్పఁబడిన శ్రవణ ద్వయము గలది, లేక బాళీలను దుద్దులు ధరించిన చెవులు గలది, చెవిలోఁ బొగడపువ్వును ధరించినది, తన విలాసగమనము ననుగమించు హంసల గుంపు గలది, సఖురాం డ్రాదరముతో వినునట్లుగా మధుర మైన కథలు చెప్పునది, పద్మముల వంటి కన్నులు గలది, వ్యర్థము కాని చూపులు గలది. పద్మమును జేతిలో ధరించినది, శ్రీకృష్ణునకుఁ జెల్లె లైనది, తాటాకు రంగు వంటి నల్లని శరీరము గలది యగు శ్రీకాళీదేవి నా కెల్లప్పుడు నిక్కడే శుభములు గూర్చుఁగాక!

***విశేషములు :***

(1) ఈ శ్లోకము నందలి 'వాలీ – బాలీ – చూలీ – మాలీ' శబ్దముల కర్థము చెప్పుటలో వ్యాఖ్యానమే శరణ్యము.

వాలీ – బాలీ

ముత్తైదువలగు స్త్రీలు చెవులకు ధరించు దుద్దులకు బాళీ లని పేరు. పాళీ – అని కాళిదాసు. 'పాళీభృతి శ్రవసి తాళీదళం వహసి'. ప్రాచీనకాలములో స్త్రీలు తాటాకులతోఁ జేసిన కర్ణాభరణములను ధరించెడివారు. అందువల్లనే 'చెవాకు' లని పేరు వచ్చినది.

శ్లో॥ కూర్పాసకం చ తాంబూల మంగుళ్యాభరణం శుభమ్।
కేశసంస్కారకబరీకరకర్ణవిభూషణమ్॥ అని కాశీఖండము.

మ॥ పసుపుం గుంకుమ కజ్జలంబు నునుగూర్పాసంబు తాంబూలమున్
గుసుమంబుల్ కబరీభరంబు 'చెవియాకుల్' మంగళాలంకృతుల్
విసు పొక్కింతయు లేక తాల్ప వలయున్ వీనిన్ సదాకాలము
న్నసిఁ జక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై నాళీకపత్రాక్షికిన్. (కాశీ –2–73)

అని శ్రీనాథుఁడు కర్ణాభరణమును 'జెవియా' కని తెనిఁగించినాఁడు. ఇవి బృహస్పతి లోపాముద్రకుఁ జెప్పిన పతివ్రతాధర్మములు.

ఉ॥ కంచెలయుం బటీరతిలకంబును బాపట చెందిరంబు ఫా
లాంచలసీమ లేఁబసుపుటచ్చుతబొట్టుఁజెవాకు గాజులుం
గొంచెపు వీడ్యమున్ విరులకొప్పును నొప్పు నొనర్ప నెప్పుడుం
చంచలనేత్ర యుండఁ దగు సంతత భర్తృఫలాభివృద్ధికిన్. (శృం. శా –4 – 78)

అని పిల్లలమఱ్ఱి పినవీరభద్ర కవికూడఁ జెప్పినాఁడు. బాణభట్టు కాదంబరిలో – 'క్వచి ద్విధవే వోన్ముక్తతాళపత్రా' అని వింధ్యాటవిని వర్ణించినాఁడు. 'విధవేవ = మృతభర్తృకేవ। ఉభయోః శబ్దసామ్య మాహ – ఉన్ముక్తేతి – ఉన్ముక్తాని త్యక్తాని తాళపత్రాణి తాళదళాని యస్యాం సా। పక్షే – ఉన్ముక్తాని తాలపత్రాని తాటంకా యయేతి విగ్రహః।' అని భానుచంద్ర – సిద్ధచంద్రగణి వ్యాఖ్య. రాల్చిన తాటాకులు గలది వింధ్యారణ్యము. తీసివేసిన తాటాకు దుద్దులు గలది విశ్వస్త.

దీనిని బట్టి ప్రాచీనకాలములోఁ దాటియాకులతోఁ జేసిన చెవాకులను (దుద్దులను) స్త్రీలు ధరించెడి వారని స్పష్టము.

ముత్తైదువలు చెవులకుఁ దాటంకములు తప్పక ధరింపవలయును.

శ్లో॥ సుధామప్యాస్వాద్య ప్రతిభయజరామృత్యుహరిణీం
విపద్యంతే విశ్వే విధిశతమఖాద్యా దివిషదః ।
కరాలం యత్క్ష్వేలం కవలితవతః కాలకలనా
న శంభో స్తన్మూలం తవ జనని! తాటంక మహిమా ॥( సౌందర్య – 28)

భయంకర మైన ముసలి తనమును, మరణమును నాశనముచేయు నమృతమును గూడఁ ద్రాగి బ్రహ్మ, యింద్రుఁడు మొదలగు దేవత లందఱు విపన్ను లగుచున్నారు. భయంకర మైన కాలకూట విషమును మ్రింగియు నీ భర్త యగు శివుఁడు మృత్యువు నొందక మృత్యుంజయుఁ డైనాఁడు. ఓ తల్లీ! యిది యంతయు నీవు చెవులకు ధరించిన కమ్మల గొప్పతనము – అని శ్రీశంకర భగవత్పాదులు సౌందర్యలహరిలోఁ జెప్పినారు. ఇక్కడ–

(1) "అత ఏవ సువాసిన్యా కదాచి దపి కర్ణభూషణం న త్యాజ్య మిత్యుపదేశః" – అందు వల్లనే సువాసిని కర్ణభూషణము నెప్పుడు తీయఁగూడ దని యాచార్యుల యుపదేశమని యరుణా మోదినీవ్యాఖ్య.

(2) తాటంకో నామ కర్ణా భరణ విశేషః, దేశే స్త్రీణా మవైధవ్య సూచకః, విధవాభి ర్న కదాచి దపి ధారణీయః, వివాహ కాలా దారభ్య భర్త్రా బద్ధ మామరణాంతమ్ ప్రసిద్ధమ్। ఏతచ్చ కర్ణాటకదేశే తాటంక రూపమ్; ద్రవిడదేశే మాంగల్యసూత్రకమ్; గౌడదేశే శంఖవలయసిందూరాదికమ్! పశ్చమదేశే వారకూట సౌవర్ణకంకణాది। తేష్వేకం సధవాభరణం తాటంక మత్రోపాత్తమ్॥ తాటంక మనఁగా జెవులకు ధరించు నలంకారవిశేషము. దుద్దు. ఇది ప్రతిదేశము నందు స్త్రీల కవైధవ్యసూచకము. దీనిని విశ్వస్త లెప్పుడును ధరింపఁగూడదు. ఇది వివాహకాలములో భర్తచేఁ గట్టఁబడిన నాఁటి నుండి భర్త మరణించు వఱకుఁ దాల్పఁదగినది. కన్నడము మొదలగు దేశములలో దుద్దుల రూపముగా, ద్రవిడదేశాదులలో మాంగల్యసూత్ర రూపముగా, గౌడాదిదేశములలో శంఖములతోఁ జేసిన కంకణములు,

సీమంతసిందూరము (పాపటకుంకుమ) మొదలగు రూపముగా, పదమటదేశములలో నిత్తడి, బంగారము మొదలగు వానితోఁ జేసిన గాజుల రూపముగా నీయాచార మున్నది. వీని యన్నింటి యందు దుద్దులే ముఖ్య మైనవి – అని డిండిమభాష్యము.

ఈ సౌందర్యలహరి యందలి భావము –

కం॥ మ్రింగెడు వాఁడు విభుం డని
మ్రింగెడిదియు గరళ మనియు మేలని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో! (భాగ – 8స్క – 241)

అను పోతన గారి భావము వంటిది.

తే॥గీ॥ తనకు రెండు పుట్టంబులు దనకు నయిన
మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క
వినతుఁడై యుండె నారాము వితరణంబు
పాండవోత్తమ! యేమని పలుకవచ్చు. (భాగ – 9స్క – 342)

అని పోతనగారు సీతాదేవి మంగళసూత్రమును గూడ వర్ణించినారు. ఇక్కడ – మంగళసూత్రంబు మినుకు = తాళిబొట్టు – అని శ్రీకల్లూరిసుబ్రహ్మణ్యదీక్షితులుగారి లఘుటీక. ప్రాచీనకాలములోఁ దాటంకధారణ మెంత ముఖ్య మైనదో నేఁటి కాలములో మంగళసూత్రధారణ మంత ప్రధానమైనది. మొదటఁ దాటాకుతో మంగళసూత్రము కట్టెడు వారు. అందువల్లనే తాళి, తాళిబొట్టు, తాళికట్టు – అను వ్యవహారమేర్పడినది. తాటాకు క్రమముగా మామిడాకు, పసుపుకొమ్ముగా మారి నేఁడు బంగారముతోఁజేసిన మంగళసూత్ర మైనది. మంగళసూత్రపు బిళ్ళలపై కమసాలులు మామిడాకును జిత్రించుచున్నారు.

మంగళసూత్రధారణము మధ్యకాలములో వచ్చిన సంప్రదాయము గాని ప్రాచీనవైదిక – స్మార్తాచారము గారు. పోతన – శ్రీనాథులు మంగళసూత్రమును బేర్కొనుటచే 15శతాబ్ది నుండి యల్లసాని పెద్దన, పింగళి సూరన, చేమకూర వేంకటకవి మొదలగు కవులందఱు వివాహఘట్టములో మంగళసూత్రధారణమును దప్పకుండ వర్ణించిరి. పాలకుఱికి సోమనాథుఁడు (13.శ) కూడ మంగళసూత్రమును బేర్కొనినట్లు జ్ఞాపకము.

శ్లో॥ మాంగల్యతంతునానేన మమ జీవనహేతునా।
కంఠే బధ్నామి సుభగే! జీవంతు శరదాం శతమ్॥

అనునది యర్వాచీనశ్లోకము.

సంస్కృతకవు లెవ్వరు మంగళసూత్రమును వర్ణింప లేదు. భవభూతిమహాకవి

మాలతీమాధవములో–

శ్లో॥ అంత్రైః కల్పితమంగళప్రతిసరాః స్త్రీహస్తరక్తోత్పల
వ్యక్తోత్తంసభృతః పినహ్య సహసా హృత్పుండరీకస్రజః ।
ఏతాః శోణితపంకకుంకుముజుషః సంభూయ కాంతైః పిబం
త్యస్థిస్నేహసురాః కపాలచషకైః ప్రీతాః పిశాచాంగనాః ॥ (మాలతీ – 5 – 18)

పిశాచాంగనలు ప్రేఁగులతో మంగళప్రతిసరములను ధరించి నట్లు చెప్పినాఁడు, మంగళప్రతిసర మనఁగాఁ గరకంకణ సూత్రమే (తోరము) కాని గళమంగళసూత్రము కాదు. "అంత్రై రచితో మంగళార్థమ్ ప్రతిసరో హస్తసూత్ర మూర్ణామయం యాభి స్తాః। అవైధవ్యచిహ్నామ్ మంగళప్రతి సరో భవతి। యద్వా ప్రతిసరః కంకణమ్ 'కంకణే కరసూత్రే చ భవేత్ ప్రతిసరోఽ స్త్రియామ్' – ఇతి మేదినీకరః" అని జగద్ధరటీక.

నల్లపూసలు కూడ నిట్టివే. హిందువులు వివాహ సమయములో వధువు మెడలో మంగళసూత్రము కట్టునట్లే తురుష్కులు పెండ్లికూఁతురు కంఠమునకు నల్లపూసలదండ కట్టుదురు. తురుష్కులు భారతదేశమునాక్రమించిన తరువాత హిందువుల కన్యలను బలాత్కారముగా నెత్తుకొని పోయి యనుభవించెడివారు.

పెండ్లి యైన సువాసినులను ముట్టఁగూడ దని వారి ధర్మశాస్త్రము (కురాను) లో నున్నదఁట! వీరి యుపద్రవము నుండి తప్పించు కొనుటకై భారతీయులు తమ కన్యలకు రజస్వలలు కాక పూర్వమే వివాహము చేసి నల్లపూసలు కట్టెడి వారు. నల్లపూసలు ధరించుట తురకల పద్ధతి కాని హిందువుల సంప్రదాయము కాదు. ఈ యాచారము విజయనగరసామ్రాజ్యకాలము (14శ) నుండి దేశములో వచ్చినది. మాదయ్యగారి మల్లన రాజశేఖరచరిత్రములో–

తే॥గీ॥ సవిధకీర్ణపరాగాగ్ని సాక్షి గాఁగఁ
దమ్మివిందు కరగ్రహణమ్మొనర్పఁ
బొలుచు పద్మినికిని నల్లపూసదండ
గట్టినాఁ డన నెలదేఁటిగములు పొదలె.(రాజ –2–69)

అని నల్లపూసల ప్రస్తావము కలదు. ఇది సూర్యోదయవర్ణనము. పద్మముల నుండి రాలిన పుప్పొడియే యగ్నిసాక్షిగా నున్నది. సూర్యుఁడు పద్మినిని బెండ్లాడి యామె మెడలోఁ గట్టిన నల్ల పూసల దండ వలెఁ దుమ్మెదల బా రున్న దని భావము.

ఈ విషయమునే యారుద్రగా రిట్లు చెప్పినారు–

"పుస్తెలూ పూసలూ ఐదవతనానికి చిహ్నా లని యాంధ్రమహిళలు భావిస్తారు. మంగళసూత్రధారణ తోపాటే నల్లపూసలు కూడా పెళ్ళినాడు ధరిస్తారు. ఈ ఆచారం ఆదిమ

కాలంలో లేదు. కాకతీయయుగం లోని కవులు పెళ్ళిని వర్ణిస్తూ తలంబ్రాలు పోసుకోడాన్ని వర్ణించారు. శ్రీనాథుఁడు, పోతరాజు గారు మంగళసూత్రాన్ని పేర్కొన్నారు. తెలుగు ఇల్లాలి మెడలో నల్లపూసలను తొలిసారి కట్టించిన కవీశ్వరుఁడు మాదయగారి మల్లన.”

(స.ఆ.సా - 7సం - 54 పుట.)

కం॥ బలవంతుఁడు బలహీనుఁడు
పొలుతురు విధి దప్ప నల్లపూసలు ముత్యాల్
తొలఁగుఁ గద మగఁడు పోయిన
వెలఁదుకకున్ బొణుగుపాటి వేంకటమంత్రీ!

అని యడిదము సూరకవి చెప్పినాఁడు.

ఇవి ప్రాచీనాచారములు కాకపోయినను

శ్లో॥ శ్రుతిః స్మృతిః సదాచారః (యాజ్ఞ -1-7 )

అని యాజ్ఞవల్క్య మహర్షి చెప్పినట్లుగా మధ్యకాలములో వచ్చిన సదాచారములు.

ప్రసక్తానుప్రసక్తముగా నింత చెప్పవలసి వచ్చినది. చెవిదుద్దులు ధరించుట ప్రాచీనాచార మనియు, మంగళ సూత్రములు, నల్లపూసలు ధరించుట మధ్యకాలములో వచ్చిన సదాచార మనియు సారాంశము. తాటాకులతోఁ జేసిన తాటంకములు ధరించుట యతిప్రాచీనాచార మని ప్రస్తుతాంశము.

***2. నాలీక :***

న + అలీక = నాలీక. సవర్ణదీర్ఘసంధి.

తస్మా న్ను డచి (6-3-74) అను సూత్రముచే ‘న + అలీక = అనలీక - అని కావలయును.

నైక శబ్దః సుప్సుపేతి సమాసాత్ (కావ్యా -5-2-12)
అని వామనుని కావ్యాలంకార సూత్రము.

నైకధేత్యాదే తు నశబ్దేన సహ సుప్సుపేతి సమాసః - అని సిద్ధాంతకౌముది. నఞర్థకమగు నశబ్దమునకు సంధి వచ్చి ‘నాలీక’ - యని యగుచున్నది. నాక - నైక - నదవీయసి మొదలగు శబ్దము లిట్లే యేర్పడినవి. వేదపురాణశాస్త్రపదవీనదవీయసి (కాశీ -7-161) అని శ్రీనాథుఁడు; కాయంబు నాపాయమే (భాగ -8స్క-592) అని పోతన ప్రయోగించినారు.

***3. కాలీయశాసి :***

శ్రీకృష్ణుఁడు యమునాహ్రదములోఁ గాళియుఁడను పాముపై దూఁకి వాని పడగలపై నాట్యము చేసి మర్దించిన కథ భాగవతములోఁ బ్రసిద్ధము. కాలీయశాసి = శ్రీకృష్ణుఁడు.

కాలియుఁడే కాలీయుఁడు. సంజ్ఞావాచకము కావున దోషము లేదు.

*4. కాలీయశాసిసహజ :*

శ్రీకృష్ణుఁడు దేవకీదేవి కడుపునఁ బుట్టినను యశోద బిడ్డగాఁ బెరిగినాఁడు. దుర్గాదేవి యోగమాయగా యశోదకుఁ బుట్టినది. ఈ విధముగాఁ గాళీదేవి శ్రీకృష్ణునకు సోదరి యైనది. ఈ కథ కూడ భాగవతములోఁ బ్రసిద్ధము.

ఈ శ్లోకము కాళిదాసు రచించిన దేవీస్తుతిలోని –

శ్లో॥ యాఽఽళీభి రాత్తతను–పాళీ లసత్ప్రికయ–పాళీషు ఖేలతి భవ
వ్యాళీనకు ల్యసిత–చూళీభరా చరణ–ధూళీలసన్మునిగణా ।
పాళీభృతి శ్రవసి–తాళీదళం వహతి–యాఽళీకశోభితిలకా
సాఽళీకరోతు మమ–కాళీ మనః స్వపద–నాళీకసేవనవిధౌ ॥

అను శ్లోకమున కనుకరణము. ౨౪

## ౨౫. శివస్తుతి

***అవతారిక :*** జగన్నాథకవి శివస్మరణముతోఁ గావ్యమును మంగళాంతముగా ముగించుచున్నాఁడు.

**శ్లో॥ దక్షాఽధ్వర ప్రశమ–దక్షాఽఽగ్రహం విబుధ–పక్షాఽభిపాలనపరం**
**లక్షాఽమృతద్యుతివ–లక్షాఽఽత్మకం హృతవి–పక్షాఽఽత్తవిస్మయకథమ్ ।**
**ఉక్షాధిరోహి హత–లక్షాఽసురప్రకర–మక్షామతాఽశ్రయదయమ్ ।**
**త్ర్యక్షాఽఽహ్వయమ్ ప్రణత–రక్షామణిమ్ ప్రణయి–యక్షాఽధిపం స్మర! మహః ॥ ౨౫**

***వ్యాఖ్య :*** దక్ష + అధ్వర = దక్షుని యజ్ఞమును; ప్రశమ = ధ్వంసము చేయుటలో; దక్ష = సమర్థ మైన; ఆగ్రహమ్ = కోపము కలది; విబుధ = దేవతల యొక్క; లేక పండితుల యొక్క; పక్ష = పక్షమును; అభిపాలనపరమ్ = రక్షించుటలోఁ దాత్పర్యము కలది; లక్ష = లక్ష సంఖ్య గల – నూఱు వేల; అమృతద్యుతి = చంద్రుల వంటి; వలక్ష + ఆత్మకమ్ = తెల్లని దేహము కలది; హృత = హరింపఁబడిన; పరాజితులుగాఁ జేయఁబడిన; విపక్ష = గజాసురుఁడు, త్రిపురాసురులు మొదలగు శత్రువులచే; ఆత్త = పొందఁబడిన; విస్మయ = ఆశ్చర్యము కలిగించు; కథమ్ = కథలు గలది. శివుఁడు గజాసుర – త్రిపురాసురాది రాక్షసులను సంహరించిన కథ లాశ్చర్యము గల్గించున వని భావము. ఉక్ష + అధిరోహి = ఎద్దు వాహనముగాఁ గలది – నంది నెక్కునది; హత = చంపఁబడిన; లక్ష = లక్షల కొలఁది; అసుర = రాక్షసుల యొక్క; ప్రకరమ్ = సమూహము కలది, అక్షామతా = అకృశత్వమునకు; ఆశ్రయ = అండయైన – విపుల మైన; దయమ్ = కరుణ కలది; ప్రణత = వంగి నమస్కరించు భక్తులకు; రక్షామణి =

రక్షించు మణి యైనది. ప్రణయి = చెలిమికిఁ బాత్రుఁ డగు; యక్ష + అధిపమ్ = కుబేరుఁడు కలది; త్రి + అక్ష – త్ర్యక్ష + ఆహ్వాయమ్ = ముక్కంటి యను పేరు గలది యగు; మహః = తేజస్సును; అనఁగా శివుని; స్మర = స్మరింపుము.

**తాత్పర్యము :** దక్షయజ్ఞమును నాశనము చేయుటలో సమర్థమైన కోపము గల వానిని; విబుధపక్షపాతి యైన వానిని; లక్షచంద్రుల కాంతి వంటి తెల్లని కాంతిగలవానిని, రాక్షసులను జంపుటలో నాశ్చర్యము కలిగించు కథలు గల వానిని; నందివాహనుని, లక్షల కొలఁది రాక్షసులను జంపిన వానిని; కృశింపని విస్తారమైన కృప గల వానిని, మూఁడు కన్నుల గల వానిని, భక్తులకు రక్షామణి యైన వానిని, కుబేరునకు మిత్రుఁ డైన వానిని, తేజఃస్వరూపుని శివుని స్మరింపుము.

***విశేషము :*** ఈ శ్లోకము కాళిదాసు రచించిన దేవీదశశ్లోకస్తుతి లోని–

శ్లో॥ దాక్షాయణీ దనుజ–శిక్షావిధౌ వికృత–దీక్షామనోహరగుణా
భిక్షాశినో నటన–వీక్షావినోదముఖి– దక్షాధ్వరప్రహరణా ।
వీక్షాం విధేహి మయి–దక్షా స్వకీయజన–పక్షా విపక్షవిముఖీ
యక్షేశసేవితని–రాక్షేపశక్తిజయ–లక్ష్మ్యావధానకలనా ॥

అను శ్లోకమున కనుకరణము.

కాళిదాసు శ్లోకములో నాల్గవ పాదములోఁ బ్రాసములు తప్పినవి. జగన్నాథకవి 25 శ్లోకములలో నొక్కచోటఁ గూడఁ బ్రాసము తప్పకుండ సంపూర్ణకావ్యమును నిర్వహించుట విశేషము. ౨౫

## ౨౬. గ్రంథోద్దేశము

***అవతారిక :*** ఇప్పుడు కవి గ్రంథోద్దేశమును, గ్రంథప్రయోజనమును జెప్పుచున్నాఁడు.

**శ్లో॥ రామనామ్నః స్వపౌత్రస్య కామనాపూరణోత్సుకః ।**
**అశ్వధాటీం జగన్నాథో విశ్వహృద్యామరీరచత్ ॥** ౨౬

***వ్యాఖ్య :*** రామనామ్నః = రాముఁడను పేరు గల; స్వపౌత్రస్య = తన మనుమని యొక్క; కామనా = కోరికను; పూరణ = పూరించుట యందు; ఉత్సుకః = ఉత్సాహము గల వాఁడైన – ఇష్టార్థమును గల్గించుట కుద్యుక్తుఁడైన; జగన్నాథః = జగన్నాథుఁ డను కవి; విశ్వహృద్యామ్ = లోకములో నందఱి మనస్సులకు హితవైనది – హృదయములకు హత్తుకొనునది యగు; అశ్వధాటీమ్ = అశ్వధాటీవృత్తములతోఁ గూడిన కావ్యమును; అరీరచత్ = రచించెను.

**తాత్పర్యము :** తన మనుమఁడైన రాముని వాంఛను బూర్తిచేయుటకు, నిష్టార్థములను గల్గించుటకు నుత్సహించిన జగన్నాథకవి సకల జనహృదయ స్పృహణీయ మైన యశ్వధాటీ కావ్యమును రచించెను.

జగన్నాథకవి తన పౌత్త్రుఁడగు రాముని నిమిత్తముగాఁ జేసికొని యీ యశ్వధాటీకావ్యము ద్వారముగా లోకములోని జనులకు నీతి – భక్తి – జ్ఞాన – వైరాగ్యములను బోధించెను.

***విశేషము :*** ఈ చివరి శ్లోక మనుష్టుప్ పద్యము.

శ్లో॥ పంచమం లఘు సర్వత్ర సప్తమం ద్విచతుర్థయోః ।
షష్ఠం గురు విజానీయా దేతత్పద్యస్య లక్షణమ్ ॥
అని కాళిదాసు శ్రుతబోధము.

అనుష్టుప్ పద్యములో నాలుగు పాదములు, పాదమునకు 8 అక్షరములు నుండును. నాలుగు పాదము లందు నైదవ యక్షరము లఘువుగా నుండును. మూఁడు నాలుగు పాదములలో నేడవ యక్షరము లఘువుగా నుండును. నాల్గుపాదము లందు నాఱవ యక్షరము గురువుగా నుండును. ఇది శ్లోకలక్షణము.

***గద్యమ్ :*** **ఇతి పండితేంద్ర జగన్నాథ విరచిత మశ్వధాటీకావ్యం సంపూర్ణమ్ ॥**

ఇతి = ఈ విధముగా. ఇతి యనునది సమాప్తిని సూచించును. 'ఇతి హేతుప్రకరణప్రకాశాది సమాప్తిషు' – అని యమరకోశము. పండిత + ఇంద్ర = పండితులలో శ్రేష్ఠుఁ డగు; పండితేంద్రుఁ డను బిరుదు గల; జగన్నాథ = జగన్నాథకవిచే; విరచితమ్ = రచింపఁ బడిన; అశ్వధాటీకావ్యమ్ = అశ్వధాటీకావ్యము; సంపూర్ణమ్ = పూర్తి యైనది.

రాముని వలెనే పాఠకులు కూడ సర్వదేవతాదయాసిద్ధి సకలకామనాలబ్ధి పొందుట యీ యశ్వధాటీకావ్యపరమప్రయోజనము గావున సర్వము మంగళము.

**తే॥గీ॥ పుష్పగిరిశంకరాచార్యపూజ్యపాద**
**దత్తవిద్యావిభూషణోద్దండబిరుద**
**ధారి గరిమెళ్ళ కవి యశ్వధాటికృతికి**
**వ్యాఖ్య యొనరించె నవవీథి యనఁగ నాంధ్రి.**

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

***గద్యము :*** ఇది శ్రీమత్పరమేశ్వరకరుణాకటాక్షలబ్ధకవితావిచిత్ర పరాశరగోత్ర శ్రీగరిమెళ్ళకృష్ణావధానిపౌత్త్ర సూర్యనారాయణ సూర్యాంబికాపుత్త్ర సకలసుకవిజనవిధేయ సహజపాండిత్య యచ్యుతసత్యశేషగిరిసోమయాజిశర్మ నామధేయ ప్రణీతం బైన యశ్వధాటీకావ్య – నవవీథీ వ్యాఖ్యానము సర్వంబును సంపూర్ణము.

**శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు**
**మంగళమ్ మహత్**
**శ్రీః శ్రీః శ్రీః**